శ్రీరస్తు.

# సంగభావాలీయము

ఇది

కమ్మకులాలంకారుఁడై, కొత్తవంశ పయఃపారావార రాకాసుధా
కరుఁడై, కీర్తిశేషుఁడైన

## శ్రీ సంగన్నగారి వంశచరిత్రమును దెలుపు గ్రంథము.

సంగమ చామర్లపుర నివాసియగు

కొత్త శివలింగయ్యగారి కుమారుఁడు

**భావయ్యచే**

రచియింపఁబడినది.

---

పండిత పరిష్కృతము.

---

ప్రథమ కూర్పు.

1929

రజత ముద్రాక్షరశాల : తెనాలి.

శ్రీ ర స్తు.

# సంగభావాలీయము

ఇది

కమ్మకులాలంకారుఁడై, కొత్తవంశ పయఃపారావార రాకాసుధా
కరుఁడై, కీర్తిశేషుఁడైన

శ్రీ సంగన్నగారి వంశచరిత్రమును దెలుపు గ్రంథము.

సంగమ చామర్లపుర నివాసియగు

కొత్త శివలింగయ్యగారి కుమారుఁడు

**భావయ్యచే**

రచియింపఁబడినది.

---

పండిత పరిష్కృతము.

---

ప్రథమ కూర్పు.

1929

రజత ముద్రాక్షరశాల : తెనాలి.

# పీఠిక.



ఆదర్శప్రాయులగు మహాపురుషుల చరిత్రములఁ బఠించుటవలననే జనులకు మనోవికాసముగల్గి యది వారి యభ్యున్నతి కాధారభూతమగును. అందును స్వదేశ, స్వమత, స్వవంశోద్ధారకు లాదిగాఁగల మహాత్ముల చారిత్రములగుఱించి చెప్పనక్కఱయే లేదు. అట్టివారి చరిత్రలు మనోహరముగ వ్రాసి వారికీర్తిని వన్నెదెచ్చి లోకకల్యాణమునకు దోడ్పడుట కవుల ధర్మము.

ఈ కథానాయకుఁడట్టి మహనీయులలోఁ జేర్పఁదగినవాఁడు. ఏలనన, నితఁడు కమ్మకులాలంకారుఁడై, కొత్తవంశోద్ధారకుఁడై పేరు ప్రతిష్ఠలఁ గొన్నవాఁడు. ఈచుట్టుపట్ల గ్రామములలో నితని పేరెఱుంగని పెద్దలు లేరు. ఈతఁడు వాసిరెడ్డి వెంకటాద్రి ప్రభువర్యునకు సమకాలికుఁడు. అసమాన దేవతాబ్రాహ్మణభక్తి తత్పరుఁడనుట కితఁడేర్పాటుజేసిన యనేక మాన్యములే సాక్షి. ఆకాలములో నన గా నిప్పటికి రమారమి 150 యేండ్ల క్రిందట నీతఁడు సామంతుఁడుగానుండి గ్రామముల యిజారాదారై, రైతులకు ప్రభువులకు మధ్య నన్యోన్య సామరస్యము పెంపొందించుచు నప్పటి హాలికుల కెల్లరికి నాదర్శప్రాయుఁడై వారిపాలకుఁడయ్యెను.

ఇట్టి మహాపురుషుఁడగు మావంశతిలకుని చారిత్రము లేని కొఱంత చాలకాలమునుండియు నాకు గోచరించియు, దానిని

వ్రాయుసామర్థ్యములేకను, మఱియు సాధన సామగ్రి దొరకమిని బెక్కు నాళ్లూరకుండ వలసినవాఁడనైతిని గాని తుదకు దైవ ప్రేరణచే నాకు దీనియందుగల యుత్సాహమే నన్నీపనికి బ్రేరేపఁగానెట్లో వ్రాసి ముగింపఁగల్గితిని. ఈయన చరిత్ర మంతయు లభ్యముగానందున దెలిసినవరకు నేకత్రీకరించి క్లుప్తముగ వ్రాయవలసివచ్చెను. పితృదేవతలకెల్లరికి బ్రీతిగా నుండులాగున నీయనకు వెనుక ముందఱవారి కథనమంతయు నిందుఁగూర్చితిని. ఇందలి యితివృత్తమంతయు యథార్థ కథనమునే దెల్పుచుండును. వసుచరిత్రకారుఁడు చెప్పిన 'కేవల కల్పనాకథలు, అను పద్యసారము ననుసరించి దీనంగల వర్ణనాదులయందు మాత్రమతిశయోక్త్యాలంకారములు జేర్పఁబడినవి. ఈపురుషుని కథావశేషమున నీయన వంశవివరణము గావింపఁబడినది. ఈగ్రంథము వ్రాయుటయందు మొదలి నుండియు నాకత్యంత సహాయకారిగానున్న నామిత్రుఁడును, కవివర్యుఁడునగు శ్రీయుత ముమ్మలనేని శివలింగయ్యచౌదరి గారికి నేనెంతయు కృతజ్ఞుఁడను. గ్రంథాంతమున వ్రాయబడి నట్టిది యక్షయ వత్సరమున విజయదశమి నాటికిఁబూర్తియైన దీనియం దిప్పటివరకును సవరణలఁ జేయుచునే వచ్చితిని.

సమగ్రమైన కొత్తవారివంశచరిత్రమెప్పటికైన నిర్మాణ మగుచో నిందలివిషయములు దానికుపకరించును. అట్టినిర్మాణ కార్యదీక్షతను వంశీయులు గైకొనెదరుగాక. అట్టి నిర్మాణ కార్యముగాని, యీగ్రంథరచనముగాని స్వార్థపరత్వముగల కార్యములని లోకులు కొందఱెంచవచ్చును గాని నాకట్లు

తోఁచదు. ఏమన, భిన్నభిన్న శాఖలన్నియు నొకదానినిజూచి మఱొకటి తమస్థితిగతులన్నియుజక్కఁగా దెలుసుకొని తన్మూలమున నభివృద్ధినొందినగాని ప్రత్యేకసంఘములు, వానిమూలమున దేశమును సర్వవిధముల నభివృద్ధిఁ గాంచవని నానమ్మకము. అందుచే వారివారి చరిత్రాపరిశోధనములను దెలిసినంతవరకు గావించుకొని ప్రకటించుటగూడ దేశసౌభాగ్యమునకు కారణమగును. గ్రామచరిత్రలు కావలెననికోరెడి యీ తరుణమున ముందు వ్రాయబడబోవు మాగ్రామచరిత్రకు నిదిగూడ గొంతవర కాధారమగుచో నేను ధన్యుఁడను. దీనిని కాలమే నిర్ణయమొనర్చును.

ఈగ్రంథమున, ర, అ మున్నగు భేదములు పాటింపబడలేదు. ఇదిగాక వంశచరిత్రము వ్రాయుటకిదియే నాప్రథమ ప్రయత్నము. అందు నిది కావ్యశైలిగాగూర్చి వ్రాసితిని. అందుచే నల్పజ్ఞుఁడనగు నారచన యందెంతవరకు నేను జయమొందితినో, దీనిలో నెన్నిలోపములున్నవో వానినన్నిఁటిని క్షీరసారన్యాయమున గుణదోషనిర్ణయమొనర్చుటకు బండితలోకమే శరణ్యము.

ఈగ్రంథమును సంస్కరించిన బ్రహ్మశ్రీ విద్వాంసులుగు చంద్రమౌళిశాస్త్రిగారికిని, గ్రంథముద్రణమునకై దోడ్పడిన మావంశీయులకెల్లరికి నాహృదయపూర్వక వందనము లాచరించు చున్నాఁడను.

సంగంచాగర్లమూడి,
19—12—29.

ఇట్లు,
గ్రంథకర్త.

# విషయసూచిక

పరుసనంఖ్య. (ప్రథమాశ్వాసము) పుట.



(ద్వితీయాశ్వాసము.)



(తృతీయాశ్వాసము.)

—:0:—

## తప్పొప్పుల పట్టిక.

| పుట. | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 4 | 10 | యల్లైన | యెల్లైన |
| 23 | 10 | యన్నట | యెంతయు |
| 68 | 5 | మొలికి | ములికి |
| 82 | 1 | హసిత | హసన |

ఇంకను కొన్ని స్ఖాలిత్యములు గలవు. వానిని పాఠకులే సవరించు కొందురుగాక.



శ్రీరస్తు.

శ్రీశారదాంబాయైనమః.

# సంగభూపాలీయమను

## సంగన్నగారి వంశచరిత్రము.

॥ శ్రీకరుఁడార్తరక్షకుఁడు ♦ చిన్మయరూపుఁడు సర్వదేవతా
నీకహృదబ్జభాస్కరుఁడు ♦ నిత్యుఁడనంతుఁడు నిర్గుణుండు సు
శ్లోకుఁడు భక్తపాలకుఁడు ♦ సూరిజనస్తవనీయుఁడీశ్వరుం
డీకృతికర్తఁ బ్రోచుత న ♦ హీనకృపాకలితాంతరంగుఁడై. 1

సీ॥ ఎవ్వానిచరితంబు ♦ లించుకంతఁబఠింప
సకలాఘసంతతుల్ ♦ సమయుచుండు
నెవ్వానినెదలోన ♦ నేవేళభజియింపఁ
గోరికలెల్ల జే ♦ కూరుచుండు
నెవ్వానికృపచేత ♦ నీలోకమంతయు
నాడుచుఁ బాడుచు ♦ నలరుచుండు
నెవ్వానియిచ్ఛచే ♦ నెల్లజగంబులు
భస్మరాసులలీలఁ ♦ బరగుచుండు
తే॥ నెవనినామంబు జపియింప ♦ దివిజకోటి
యంచితంబగు ముక్తిని ♦ గాంచుచుండు
నట్టిపరమేశునచ్యుతు ♦ నమితభక్తిఁ
గొలుతునీకృతి రక్షింపఁ ♦ గోరి సతతము. 2

తే॥ వేదవేద్యు చిదానందు ♦ విశ్వనాథు
నప్రమేయుని నాది ♦ మధ్యాంతశూన్యు

నిర్వికారు నిరంజను ♦ నిఖిలలోక
వంద్యునీకృతి రక్షింపఁ ♦ భక్తిఁ దలఁతు. 3

తే॥ జగములెల్ల సృజించి ర ♦ క్షణమొనర్చి
సమయఁగాఁజూచు నెవ్వాఁడు ♦ సమయ మెఱిఁగి
యన్నిటికిఁగర్త ♦ భర్తయు హర్తయగుచు
నలరునాదేవునెంతు న ♦ న్నాదరింప. 4

తే. పంచభూతంబులెవ్వాని ♦ వలనగలిగె
సూర్యచంద్రాదులెవ్వాని ♦ చూడ్కులండ్రు
కాలమృత్యు వెవ్వాని ని ♦ క్కంపుబంటు
కావ్యసిద్ధికై నేనట్టి ♦ ఘనునిదలఁతు. 5

తే. సరససంగీత సాహిత్య ♦ సారములను
తనివిదీర్చు భాషాఘోష ♦ తలఁపనట్టి
పలుకులకురాణి గీర్వాణి ♦ నలువరాణి
వాణిఁబ్రణుతించువాఁడనా ♦ వాణినుండ. 6

తే॥ అఖిలవిద్యలకును గురుం ♦ డైనవాని
దేవగణనాయకుని ♦ మహాదేవపుత్రు
నేకదంతు వినాయకు ♦ నెంతుమదిని
విమలవాక్సిద్ధి కొఱకునై ♦ యమితభక్తి. 7

తే॥ స్మృతులు, వేదముల్ ప్రకటించు ♦ యతులకెల్లఁ
వందనమ్ములఁజేసి య ♦ పారభక్తి
వ్యాసవాల్మీకి శుకులకుఁ ♦ బ్రణుతిఁజేసి
కాళిదాసాది సంస్కృత ♦ కవులనెంతు. 8

ఉ॥ రాకులమందుఁబుట్టి తన ♦ రాజసమెల్ల నడంగఁజేసి, సు
శ్లోకుఁడునాగనల్దెసల ♦ శోభిలి, జ్ఞానవిహీనులకా దయా
నీకతఁ బ్రోవఁగావ్యమున ♦ నిర్మలతత్త్వ ముపన్యసించి తా
నేకతసిద్ధిబొందిన ఋ ♦ షీశ్వరు వేమకవీంద్రు నెంచెదన్. 9

తే॥ తెలుఁగుకవితకు బ్రథములై ♦ చెలఁగినారు
నన్నయాదులు; ♦ వారికి నతులొనర్చి
సకలకావ్యముల్ జేసిన ♦ సరణిఁదలఁచి
యాధునిక కవులందఱ ♦ నభినుతించి. 10

తే॥ మద్గురుని రామయాఖ్యునిమది ♦ నుతించి
పరమభాగవతోత్తమ ♦ భక్తిఁగలిఁగి
ప్రకృతిపండితులెల్లరఁ ♦ బ్రస్తుతించి
కుకవిజాలంబు దూషింతు ♦ సుమతులగుట.

తే॥ కోకిలనె లోకమునఁబాడఁ ♦ గోరఁజనదు
కాకఘూకంబులాదిగ ♦ గలవువేలు
వానినన్నిఁటిఁబోషించు ♦ ప్రభుఁడొకండె
యున్నిఁటినివినియానంద ♦ మందుచుండు. 12

వ॥ కావున సచ్చిదానందమూర్తియగు పరమేశ్వరుండు నాకు బ్రసాదించు తెఱంగున శిష్టాచార ప్రకారమ్ముగ నిష్టదేవతాస్తుతియు. సుకవిజన ప్రశంసయు, కుకవిజనతిరస్కారంబుగావించి యొక్క కావ్యనిర్మాణంబు పితృదేవతా ప్రీత్యర్థముగ నొనర్పందలంచియున్నంత.

తే॥ ఏచరిత్రంబు నే రచి ♦ యింపవలయు?
శాశ్వతంబుగ వెలయునీ ♦ విశ్వమందు

పితరులెల్లను దేనిచేఁ ♦ బ్రీతిగందు
రొక్కొ యని చింతిలఁగ నొక్క ♦ యూహగలిగె. 13

క॥ ఇంద్రద్యుమ్నునివలె నా
చంద్రార్కము నిలుచువారి ♦ చారిత్రంబుల్
సాంద్రయశోవిభవంబులఁ
గేంద్రీకరణముగ వ్రాయఁ ♦ గృతినొందనుచున్.

తే॥ ఉభయతారకమద్భావ ♦ నొందవచ్చుఁ
గాకయని మోదమున నన్నుఁ ♦ గన్నవారి
ఋణముఁ దీర్పని జన్మంబు ♦ వృథయటఁచు
నెంచి యట్లైన దీర్చెద ♦ నంచుఁదలఁతు

తే॥ పైతృకంబగు ఋణమునా ♦ వంటి సుతుఁడు
తీర్పఁజాలనిదైనఁ ♦ దెగువఁజేసి
చంద్రునకునూలుపోగను ♦ సజ్జనోక్తి
ననుసరించి సమర్పణ ♦ మగునటంచు.

ఆ॥ అట్లువలఁచివారి ♦ నధిపతులంజేసి
కావ్యమునకు, దొడ్డ ♦ కార్యమెట్లు
సేయువాఁడనంచుఁ ♦ జింతించి ధైర్యాభి
మానములను బూని ♦ మానసమున.

తే॥ దేవకార్యంబు దీనిని ♦ దీర్పవలయు
నెట్టిశ్రమకైననోర్చినా ♦ యట్టియల్పు
చేతరచియింపఁగానావి ♦ ధాత్రవ్రాసె
నంచుదృఢనిశ్చయుండనై ♦ యెంచుబూని.

వ॥ ఇమ్మహాచరిత్రంబున కాధారభూతంబగు సాధన సామగ్రిం గూర్చుకొని.

క॥ మును వేంకట ♦ రమణాఖ్యుఁడు
పనిపడి రచియించెనొక్క ♦ వంశావళి గా
వున దానిననుసరించెద
నని మొదలిడి కావ్యకర్త ♦ నభినందింతున్.

సీ॥ శ్రీరామచంద్రపా ♦ దారవిందధ్యాన
సంతతార్చలను ♦ జరపువాఁడు
జపతపో హోమాది ♦ శౌచకార్యంబుల
నిష్ఠతోడ నొనర్పి ♦ నెగడువాఁడు
పేదల సాధులఁ ♦ బ్రీతితో విప్రులఁ
దానధర్మంబులం ♦ దనుపువాఁడు
సజ్జనస్తుత్యుఁడౌ ♦ సంగయాఖ్యునకుమీ
నాంబకుంజననమై ♦ నట్టివాఁడు

తే॥ సరససద్గుణఖని కీర్తి ♦ శాలియనఁగఁ
బొగడుగాంచిన శివలింగ ♦ పుణ్యతముఁడు
కొత్తవంశాంబునిధిసోముఁ ♦ డుత్తముండు
వఱలుచామర్లనగర ని ♦ వాసుఁడగుచు.

తే॥ అన్నపూర్ణ సమానయౌ ♦ నతనిపత్ని
రమ్యగుణశీలయౌసాధ్వి ♦ రాజమాంబ
కడుపునిండార మమ్ముల ♦ గన్నతల్లి
చేరికొలువఁగ నతఁడును ♦ శ్రీలఁ జెలఁగె.

క॥ ఆతల్లిదండ్రులకు వి
ఖ్యాతచరిత్రులకు జనన ♦ మందినసుతులన్
నీతివిశారదుఁ డగ్రజుఁ
డాతనయుఁడు సంగయాఖ్యుఁ ♦ డనఁ జేరొందెన్.

క॥ జనియించితినే రెండవ
తనయుఁడనై యట్టి పుణ్య ♦ దంపతులకునా
జననీజనకులకు ముదం
బెనయఁగ భావాఖ్యచేత ♦ నిలవర్ధిలితిన్.

వ॥ ఇట్లు కృతినాయకు వంశావతారంబును తజ్జన్మ వివరణంబును దెల్పి.

షష్ఠ్యంతములు.

క॥ వేదాంతవిచారకునకు
భూదేవార్థిజనకల్ప ♦ భూరుహమునకున్
ఆదర్శప్రాయునకును ♦
శ్రీదయిత పదాబ్జయుగ్మ ♦ సేవకమణికిన్.

క॥ అష్టాక్షరీ సుమంత్రా ♦
నుష్ఠాతకు సేద్యలోక ♦ నుతిపాత్రునకున్
నిష్ఠాగరిష్ఠునకును వి
శిష్టాద్వైతుఁడననొప్పు ♦ శివలింగమునకున్.

క॥ ఆగర్భశ్రీమంతున
కాగమశాస్త్రపరిశోధ ♦ నాచార్యునకున్

రాగద్వేష విసర్జిత ♦
యోగుసనఁ బుణ్యకర్ము ♦ యోగీశునకున్.

క॥ ఏతాదృశ గుణనిధికిని ♦
భూతదయాశాలి కధిక ♦ పుణ్యునకును వి
ఖ్యాత చరితునకు రాజను ♦
మాతృపరీవేష్టితునకు ♦ మజ్జనకునకున్.

వ॥ సమర్పణంబుగా నాయొనర్పంబూనిన సంగభూపా
లీయంబను సంగన్నగారివంశచరిత్రంబునకుఁగథాక్రమంబెట్లనిన.

—♦ కథాప్రారంభము. ♦—

ఉ॥ శ్రీమహితంబునై, భువన ♦ సీమ సుపర్వుల కాటపట్టునై,
రామము, రాజకల్పతరు ♦ రాజసమావృతమయ్యు, వైశ్యచిం
తామణులన్ జెలంగి, ద్విజ ♦ తారక పాదజకామధేనుశా
స్తోమపరీవృతంబునయి ♦ శోభిలుచుండు సురాలయంబనన్.

చ॥ కలదొకపట్టణంబు పరి ♦ కల్పితసుందరరమ్యహర్మ్యముల్
విలసితనిష్కుటప్రకర ♦ వృద్ధము, దివ్యసుగంధ పుష్ప స
త్ఫలపరిశోభితంబు, బుధ వంద్య సురాలయ భూషితంబును
జ్జ్వలతరనిర్మలోదకము ♦ సంగెడు కృష్ణకొంతసన్నిధిన్.

వ॥ సమస్త భోగముల కాకరంబై, రిపుజనభీకరంబై,
సకల సంపదలకు కాపురంబై, దానధర్మాది సత్కార్యంబుల
కాకరంబై సర్వవస్తుజాలశోభితంబై, దీనజనశరణ్యంబై, యొప్పు
నాపురి కొండాలి నాప్రబసిద్ధివహించె నందు.

సీ॥ సర్వవర్ణంబులు ♦ సమమని యూహించు
ప్రాజ్ఞలోకమెగాని ♦ పరులులేరు
శివకేశవులపాద ♦ సేవఁజేసెడుభక్త
వరసమూహమెగాని ♦ యొరులులేరు
తమకల్మితోడ సం ♦ తసమందు సుగుణ సం
తానంబెకానిలు ♦ బ్రజలులేరు
తమధర్మమారసి ♦ ధనము నార్జించెడు
మాన్యులేగాని సో ♦ మరులులేరు

తే॥ పరుషము లసత్యముల్ బల్కు ♦ వారులేరు
పండితుల నాదరింపని ♦ వారులేరు
పారమార్థికమతిలేని ♦ వారులేరు
అప్పురంబున నొకమూల ♦ నైనగాని.

క॥ మునికశ్యపప్రజాపతి ♦
జనియించెను తొలుత నతని ♦ సంతతివారై
ఘనులైరి క్షాత్రకుల సం ♦
జనిత యశస్కులయి కమ్మ ♦ చౌదరులు భువిన్.

ఆ॥ అట్టికమ్మకులము ♦ నందుద్భవించిన
పనుకునూళ్ళగోత్ర ♦ పటిమమెఱసి
కొత్తవంశదీప ♦ కులు నివాసమొనర్చి
రమ్మహాపురంబు ♦ నందుతొల్లి.

వ॥ అందు.

చ॥ గురుజనభక్తితత్పరుఁడు ♦ కోవిదవర్యుఁ డనూనభాగ్యసం
భరితుఁడు ధర్మవర్తనుఁ డ ♦ పారయశోవిభవుండుసద్గుణా

కరుఁడు దయాంతరంగుఁడున ♦ గణ్యబలాఢ్యుఁడు వెంకటాద్రి
చౌదరి యిలసిల్లు వైరిజన ♦ దర్పబలాతి విభంజనుండనన్.

సీ॥ ప్రియభాషణములకై వేడుకపడుగాని
పరుషోక్తులెన్నఁడు ♦ బలుకఁబోఁడు
ఆర్తులై వచ్చిన ♦ నభయమిచ్చునుగాని
వెనుకొసఁగివారల ♦ విడువఁబోఁడు
శక్తికొలందియు ♦ సకల కిచ్చునుగాని
శుష్కహస్తంబులఁ ♦ జూపఁబోఁడు
కులసతీమణి కను ♦ కూలుఁడేయగుగాని
పరసతీవాంఛను ♦ బడఁయఁబోఁడు

తే॥ పిన్నపెద్దలమన్నించి ♦ ప్రియముఁగాంచు
పేదసాదలఁ గరుణించి ♦ పేరుగాంచు
భూతదయఁగల్గి లోకవి ♦ ఖ్యాతిఁగాంచు
వెంకటాద్రీంద్రుఁ డసమాన ♦ విదితయశుఁడు. 40

వ॥ ఆతండప్పురంబున కధిపతియగుటం జేసి దానిని నీతిఁ దప్పకఁ బాలింపుచుఁ బెక్కుధర్మకార్యము లొనర్చుచుఁ బరమేశ్వర భక్తుఁడై యపారకీర్తివంతుఁడై యపర ధర్మరాజన నొప్పి వసించుచున్నంత.

క॥ ఆకమనీయాంగున క
స్తోకగుణాఢ్యుండు సమర ♦ శూరుఁడు విబుధా
నీకస్తుత్యుఁడు సూరయ
రాకేందు యశుఁడునాగ ♦ రంజిలె సుతుఁడై.

వ॥ ఆతండును బహుపరాక్రమవంతుండై యధిక విజ్ఞాన తేజోవిరాజితుండై ప్రకాశించుచుండె నంతఁగొంతకాలంబునకు.

సీ॥ ఈమహాసీయున ♦ కేడ్గురు పుత్రులు
జననమొందిరి వారు ♦ సరసమతులు
వితరణశాలియు ♦ విద్యానవద్యుండు
ప్రథితయశుండు న ♦ ప్పన్నగారు
దానధర్మాది యు ♦ దారగుణంబుల
నెన్నికఁగన్న శం ♦ భన్నగారు
కరుణాంబునిధి సుధా ♦ కరుఁడని జనులచే
మన్ననఁగొన్న కొం ♦ డన్నగారు
సాహసౌదార్యాతి ♦ శయములచేఁ బేరుఁ
గన్నట్టి పెద్దవెం ♦ కన్నగారు

గీ॥ శూరవర్యులు ధీనిధుల్ ♦ సుగుణఖనులు
క్రమత ముత్తన్న సీతన్న ♦ గార్లు చిన్న
వెంకనాఖ్యుఁ డనఁగ నా ♦ విర్భవించి
రమిత సౌందర్య శోభితు ♦ లమలయశులు.

—♦ వెంకటాద్రిచౌదరి తన మనుమలను వసుంధరా
న్వేషణమునకై బంపుట. ♦—

వ॥ ఇట్లు దిన దిన ప్రవర్ధమానంబగు పుత్ర పౌత్ర సమూహముతో నొప్పారుచు వెంకటాద్రిచౌదరి యున్నంత
ఉంబున గ్రమ క్రమంబున వర్షంబులు లేకయు,
క్కువ్వండతి వర్షంబులచేతను పైరుపంటలు వృద్ధినొంద

కుండుటం జేసి యాతండు దేశాంతరంబున బహుభూములాక్రమించి యచ్చటఁగూడ సైరుపంటలఁ బండింపఁదలంచి తన మనంబున నిట్లని యోచించె. 45

ఉ॥ ఏలాగా రమ్యహర్మ్యములి ♦ కేటికి తోటలు దొడ్లువీరికిన్
జాలునె గోధనాద్యధిక ♦ సంపదలున్ ధనధాన్యరాసులున్
జాలఁగనున్న నేమి? యివి ♦ చాలునె పంటలు బండకున్న? నే
లీలను వీరికందఱిక్ ♦ లేశము సౌఖ్యము ముందుగల్గెదున్.

తే॥ దిన దినంబును వృద్ధిని ♦ గనుకుటుంబ
ములకుఁ దగిన నివాసముల్ ♦ ముందు వెదకి
నిర్ణయము సేయుటొప్పని ♦ నిశ్చయించి
కొమరు సూరన్న రప్పించి ♦ కూర్మిఁ బలికె.

తే॥ సర్వసంపదల్ మీకిప్డు ♦ చాలియున్నఁ
దనయ పంటలు లేకున్న ♦ మనగలారె?
కాటకంబులు బ్రబలిన ♦ చేటువచ్చు
దూరదృష్టిని బనిసేయఁ ♦ దొలఁగునివియు.

ఉ॥ భూరిపరాక్రమంబునను ♦ భూపరిపాలన సేయఁగోరినన్
మీరలు కృష్ణదాటి యట ♦ మేలగు భూముల నాక్రమించి వి
స్తారయశస్కులై వివిధ ♦ సస్యములన్ వెలయించి మించి యీ
ధారుణి రత్నగర్భయను ♦ తథ్యమెఱింగి చరించుటొప్పగున్.

ఆ॥ బ్రహ్మమెల్ల నెఱిఁగి ♦ వర్తించు బుధుఁడైన
క్ష్మాతలంబు నేలు ♦ జనకుఁడైన

వ॥ ఆతండును బహుపరాక్రమవంతుండై యధిక విజ్ఞాన తేజోవిరాజితుండై ప్రకాశించుచుండె నంతఁగొంతకాలంబునకు.

సీ॥ ఈమహాసీయున • కేడ్వురు పుత్రులు
జననమొందిరి వారు • సరసమతులు
వితరణశాలియు • విద్యానవద్యుండు
ప్రథితయశుండు న • ప్పన్నగారు
దానధర్మాది యు • దారగుణంబుల
నెన్నికఁగన్న శం • భన్నగారు
కరుణాంబునిధి సుధా • కరుఁడని జనులచే
మన్ననఁగొన్న కొం • డన్నగారు
సాహసౌదార్యాతి • శయములచేఁ బేరుఁ
గన్నట్టి పెద్దవెం • కన్నగారు

గీ॥ శూరవర్యులు ధీనిధుల్ • సుగుణఖనులు
క్రమశ ముత్తన్న సీతన్న • గార్లు చిన్న
వెంకనాఖ్యుఁ డనఁగ నా • విర్భవించి
రమిత సౌందర్య శోభితు • లమలయశులు.

—• వెంకటాద్రిచౌదరి తన మనుమలను వసుంధరా
న్వేషణమునకై బంపుట. •—

వ॥ ఇట్లు దిన దిన ప్రవర్థమానంబగు పుత్ర పౌత్ర సమూహముతో నొప్పారుచు వెంకటాద్రిచౌదరి యున్నంత నప్పట్టణంబున గ్రమ క్రమంబున వర్షంబులు లేకయు, నొకొక్కప్పుడతి వర్షంబులచేతను పైరుపంటలు వృద్ధినొంద

క్రుండుటం జేసి యాతండు దేశాంతరంబున బహుభూముల నాక్రమించి యచ్చటఁగూడ పైరుపంటలఁ బండింపఁదలంచి తన మనంబున నిట్లని యోచించె. 45

ఉ॥ ఏలాగో రహస్యమార్గములి ♦ కేటికి తోటలు దొడ్లువీరికిన్
జాలునె గోధనాద్యధిక ♦ సంపదలున్ ధనధాన్యరాసులున్
జాలఁగనున్న నేమి? యివి ♦ చాలునె పంటలు బండకున్న? నే
లీలను వీరికందఁ జే ♦ లేశము సౌఖ్యము ముందుగల్గెదున్.

సీ॥ దిన దినంబును వృద్ధిని ♦ గనుకుటుంబ
ములకుఁ దగిన నివాసముల్ ♦ ముందు వెదకి
నిర్ణయము సేయుటొప్పని ♦ నిశ్చయించి
కొమరు నూరన్నరప్పించి ♦ కూర్మిఁబలికె.

తే॥ సర్వసంపదల్ మీకిప్డు ♦ చాలియున్నఁ
దనయ పంటలు లేకున్న ♦ మనగలారె?
కాటకంబులు ప్రబలిన ♦ చేటువచ్చు
దూరదృష్టిని బని సేయఁ ♦ దొలఁగునివియు.

ఉ॥ భూరిపరాక్రమంబునను ♦ భూపరిపాలన సేయఁగోరినన్
మీరలు కృష్ణదాటి యట ♦ మేలగు భూముల నాక్రమించి వి
స్తారయశస్కులై వివిధ ♦ సస్యములన్ వెలయించి మించి యీ
ధారుణి రత్నగర్భయను ♦ తథ్యమెఱింగి చరించుటొప్పగున్.

తే॥ బ్రహ్మ మొల్ల నెఱింగి ♦ వర్తించు బుధుఁడైన
క్షాత్త్రబలంబు నేలు ♦ జనకుఁడైన

ధనికుఁడైన పేద ♦ జనుఁడైనఁ గృషి లేక
వసుధపైన నిలిచి ♦ బ్రతుకఁగలఁడె?. 50

వ॥ కావున మహీపాలురకుఁగూడఁ గృషీపాలనమే కర్తవ్యంబగును. గాని వయోవృద్ధుండనగుట నేనీస్థలసంపాదన కశక్తుండ నీకొమరులందఱఁ బౌరజనంబులతో బంచి యిప్పుడు సేద్యమునకుం దగిన ప్రదేశంబులు వెదుకం బంపుము. "కృషితో నాస్తి దుర్భిక్షమ్, జపతో నాస్తిపాతకమ్" అను నార్యోక్తి వినవె? యని పల్కె నంత నాటిరాత్రి వెంకటాద్రిచౌదరి దేవునిఁ దలంచుచు నిద్రించిన నాతని కొక్కస్వప్నంబయ్యె నందు.

సీ॥ ఆర్తరక్షకుఁడౌట ♦ హాలాహలముమ్రింగి
నీలకంఠుఁడనంగ ♦ నెగడె నెవఁడు
పశుపతి తానన్న ♦ యశముగడింపఁగా
వృషభ తురఁగంబు ♦ నెక్కె నెవఁడు
సర్వసముండన ♦ సర్పరాజంబులఁ
దారహారములుగా ♦ దాల్చె నెవఁడు
భవవినాశ మొనర్ప ♦ పరమభక్తాళినిఁ
దరియింపజగముల ♦ దిరుగు నెవఁడు

తే॥ అట్టి లోకేశుఁడభవుఁ డ ♦ నాదిపురుషుఁ
డర్థనారీశ్వరుండు ద ♦ యాంతరంగుఁ
డఘవిదూరుఁడు సంతాప ♦ హరుఁడు హరుఁడు
సంగమేశ్వరుఁడపుడు సా ♦ క్షాత్కరించె.

వ॥ అంత వెంకటాద్రివర్యుం డమ్మహాదేవుని పాదకమలంబుల కెఱఁగి సాష్టాంగ దండప్రణామంబాచరించి లేవకున్న నా భక్తుని లేవనెత్తి శంకరుండు వాత్సల్యంబున నాతని కిట్లనియె.

క॥ నాదగు సంకల్పంబున
నీదుర్భిక్షములుగల్గె ♦ నిటగానమదీ
యాదేశము వినిమీరలు
యీదేశము విడచిచనఁగ ♦ నెంతయుమేలౌ.

వ॥ మీ రెచ్చటికేగుదుమాయని విచారింప నక్కఱ లేదు. మీకు వాసయోగ్యంబగు నొక్క పుణ్యస్థలంబు జెప్పెద దానికడ కేగుడు. అచ్చట మీకు సర్వశుభంబులు జేకూరు నదెట్లనిన. 55

తే॥ సంగమస్థలమందు శ్రీ ♦ సంగమేశ
నామమున నేవసించుచు ♦ న్నాఁడగాన
మీర లాప్రాంతమందున ♦ మేటి భూము
లార్జనముఁజేసి మత్కృప ♦ నందఁగలరు.

వ॥ ఇక్కడికది పద్రిక్రోసుల దూరంబుననే యున్నది. దానిచుట్టునున్న నేగ్రామములందైనను మీరువసించుచు నన్ను గొల్చుచుండిన మీకిష్ట కామ్యార్థసిద్ధిఁ గూర్చెద నని పల్కి యమ్మహాదేవుం డంతర్ధానమైన వెంకటాద్రిచౌదరి మేల్కాంచి యాస్వప్నంబున కాశ్చర్యంబు నొందుచు శంకర సాక్షాత్కారమైన తన జన్మంబు ధన్యంబయ్యెనని తలంచుచు నా వృత్తాం

తము తన సూనుని కెఱింగింప నాతండు నమితోత్సాహవం తుండై తన కుమారుల నందఱంజీఱి యా స్వప్నవృత్తాంతమం తయుం దెల్పి మఱియు నిట్లనియె.

ఉ॥ మీరలు శౌర్యవంతులకు ♦ మేటిమగంటిమిగల్గు ధీరులౌ
వారిటనెల్లకాలము ని ♦ వాసమొనర్చిన సర్వసంపదల్
పేరుఁబ్రతిష్టలుం మనకుఁ ♦ బెంపగు సాధనమేమియుంగనం
బోరికెఁగాటకంబులును♦బుట్టెడుసూచనలిందుఁ గన్పడుఁ.

క॥ స్థలములు కృష్ణానది కా
వలనున్నవి సుఖకరములు ♦ ఫలవంతంబుల్
పలుతావుల వెదకిన మీ
రలుగాంతురు మేటిపొలము ♦ లను నిశ్శంకఁ.

వ॥ కావున మీ రిప్పుడు వసుంధరాన్వేషణమునకై బయలుదేరి యుత్తమమైన భూఖండముల నాక్రమించుకొని మీ కనుకూలమైన ప్రదేశంబుల వసించు చుండవలయు మఱియు. 60

తే॥ భూములను మాత్రమేగాక ♦ భూరియశము
సకల సౌఖ్యముల్ వితరణ ♦ సాహసములు
పూతచరితుల చెలిమియు ♦ భూతదయయు
ధర్మబుద్ధియు నొందంగఁ ♦ దగుదు మీకు.

క॥ పోవును దుర్భిక్షంబులు
గావున నెల్లపుడుకృషికిఁ ♦ గడఁగుడుమీరల్

దేవునిదయచే ననువగు
తావుల గాంచెదరు వేగ ♦ దరలి వెడలిరన్.

వ॥ ఇదియునుంగాక.

క॥ ఎచ్చట వసియించిన మీ
రచ్చటి శ్రీ సంగమేశు ♦ నర్చించినచో
మెచ్చి యతఁడిచ్చు శుభములఁ
జెచ్చెరఁదరలుడిఁక నతని ♦ చెంతకునంచున్.

వ॥ నేనును గొంతకాలం బిట నివసించి యాపన్నులకుం దగిన వసతులు గల్పించి మీకడ కరుగుదెంతునని పల్కి, వారికి వలయు ధనధాన్యంబులను, వస్తు వాహనంబులను, భృత్యామాత్య పురోహితాదుల నొసంగి పంచిన వారును ప్రయాణోన్ముఖులై కృష్ణానదిం దాటి యావల పెక్కుజన పదంబులంగడచి చనుచో నొక్క మహారణ్య మధ్యంబున వీరి రాకం గనుంగొనిన బందిపోటుకాండ్రు వేలకొలఁదిగా నుండి యాకమ్మవీరులతో గొంతదనుక తుముల యుద్ధంబు జేసిరంత. 65

లయ॥ రక్కసులఁబోలి కడు ♦ వెక్కసపు చూపులను
నిక్కుచుమనంబునను ♦ నెక్కుఁడగు కోపం
బెక్కఁగనుభీకరత ♦ నక్కనను బాణములఁ
జెక్కులను ర క్తిమము ♦ గ్రక్కఁగనుచోగల్
జిక్కులవలెన్ బఱచి ♦ స్రుక్కిన సుధీవరులఁ
జిక్కులను బెట్టుచును ♦ నెక్కుడుగ నొంపన్

దక్కువగ నున్నదొర ♦ లెక్కరణిఁ దస్కరుల
నుక్కడఁపలేకఁదమ ♦ రొక్కము లొసంగన్.

వ॥ చోరు లంతర్హితులైరి. ఇట్లందఱుఁ దస్కరుల కోడి చింతాక్రాంతులై ఘటలి తమ పురంబునకే తెంచి పితా మహాజనకులకు తమ భంగపాటు నివేదించినవారును జింతించి యిది కాలప్రభావంబని తలంచి వారితో "శ్రేయాంసి బహు విఘ్నాని" యన్నట్లుగ నున్నదని పల్కి మఱికొంత బలంబును ధనంబును, వస్తుసామగ్రియుఁ గూర్చియంపినవారు నస్త్రశస్త్ర ధరులై బయలువెడలివచ్చి తిరిగి యా యరణ్యమధ్యంబునం బోవునపుడు,

లయ॥ జాడఁగని తస్కరులు ♦ వాడిగల బాణములఁ
దోడుకొని వీరలను ♦ కాడున వధింపన్
గూడుననిఁ, ద్రవ్యమును ♦ నాడటులఁ దక్కెనని
యాడికొనిమోదమునఁ ♦ గూడుకొనిరాగన్
జూడఁడని శస్త్రములఁ ♦ పోడిమినిగ్రుచ్చనని
దాడికిని గక్కుచును ♦ వేడిరుధిరంబున్
గోడుననుఁ జింతిలుచు ♦ నేడుపుల బొబ్బలిడి
కీడొదవె నెట్టులని ♦ యోడితిమటంచున్
పీడనిఁక నెవ్వరికిఁ ♦ గూడఁ గలిగింపమని
చేడియల నాసవిడి ♦ బాడియగునంచున్
వేడితిమిర క్షణము ♦ నేడుగడఁ జూపిదయఁ
జూడుఁడని చోరులను ♦ వేడదొరలంతన్.

వ॥ శరణాగత రక్షణాభిమానులౌకతన నా తస్కరుల మన్నించి వారి యాయుధంబులు మున్నగునవి లాగుకొని ముందు సాధువృత్తిచేఁ జీవించెదమని వారలవలనఁ బ్రమాణంబులం గొని వదలిరంత.

సీ॥ వీరెల్లరును వలి ♦ వేరను పురమున
కేతెంచి రచ్చటి ♦ రైతులెల్ల
శౌర్యసాహసులని ♦ సద్గుణాకరులని
విని వారి నటనుండ ♦ వేడుకొనిన
వాసయోగ్యంబులౌ ♦ వసతులుగల్గిన
స్థలములఁ గొన్నిఁటి ♦ నెలకుఁదీసి
యుండఁగఁ దోడఁగియు ♦ నుత్తమవిధులచే
వ్యవసాయమును జేసి ♦ వన్నెకెక్కి
గీ॥ రందుఁ గొందఱు తదుపరి ♦ నంది వెలుఁగు
పురమునన్ భూములార్జించి ♦ తరలిరటకు
గొందఱచ్చటి కులజుల ♦ కోర్కెనెఱిఁగి
స్నేహబాంధవ్యముల నట ♦ స్థిరపడుటయు. 70

క॥ అందొక్క సోదరుండా
బందుగుఁడగుటకుఁదొలంగి ♦ భ్రాతలకొఱకై
డెందమున జింతసేయుచు
నందఱవదలిచనె దక్షి ♦ ణాభిముఖుండై.

వ॥ ఇంతలో.

ఉ॥ వారలకగ్రజుండు బుధ♦వందితుఁడున్ సుగుణుండు నర్థిమం
దారుఁడు భూసురాదులకు♦ దారతమాన్యములిచ్చి భూరి వి

స్ఫారయశంబుఁగాంచిన వి♦శాలమనస్కుఁడు గ్రామనేతగా
ధారుణినొప్పనప్పనయు♦దైవకృపన్ గనె పుత్రషట్కమున్.

చం॥ సరసుఁడు పుట్టయాఖ్యుఁడు ప్ర ♦ శాంతమనస్కుఁడు
సుబ్బయాఖ్యుఁడున్
ఉరుతర తేజుఁడయ్యనయు ♦ యోగ్యుఁడు వెంకయ నామ
ధేయుఁడున్
స్ఫురదురు కీర్తిశోభితులు♦పూజ్యులుసంగన సూరయాఖ్యచో
దరులననొప్పి రార్వురును ♦ దర్పితశాత్రవ గర్వభంజనుల్.

—: అప్పన్నగారు చామర్లపుర ప్రవేశ మొనర్చుట :—

వ॥ ఇట్టిసుతులచే నొప్పుచు నప్పన్నగారు నచ్చటి బాంధ
వ్యంబపేక్షింపక సంగమస్థలమునకు మిక్కిలి చేరువగా
వేఱొక్కెదెస భూఖండం బార్జింపనెంచి ప్రయాణంబుజేసి
యరుగుచున్నంతఁ ద్రోవఁగో. 75

సీ॥ నెల మూఁడువర్షముల్ ♦ నిత్యమై కురియఁగా
నెల్ల సస్యంబుల ♦ నేలుదాని
నిలువుఁ ద్రవ్విన దివ్య జలరాశి గన్పడి
తరుగ క్షయమయి ♦ తనరుదాని
నంబరచుంబితమహా ♦ భూరుహంబులఁ
బలువిధంబులుగల్గి ♦ వరలుదాని
మిట్టపల్లంబులు ♦ గట్టులులేక క్షే
దారవాసంబను ♦ పేరుదాని

గీ॥ సత్రజని మిశ్రితంబైన ♦ నల్లరేగ
డగుట సస్యానుకూలమై ♦ యరఁటిపసుపు
తోటలం బెంప వీలయి ♦ వేటమార్గ
సరణి కనువగు భూప్రదే ♦ శంబుఁగాంచి.

వ॥ అయ్యది తమకు వాసయోగ్యంబని భావించి నల్దిక్కులంబరికించి యద్దాపుననే యొక్కపురవరంబు చామర్లపురి నాబడు దానిఁగనుంగొని యప్పురశృంగారమున కచ్చెరువందుచుండె. ఇఁక నాపురినుండు ప్రజల విధం బెట్లనిన.

సీ॥ పద్మజునెంతయుఁ ♦ బాటియొనర్తురు
వేదవిద్యలయందు ♦ విప్రులచట
రణవీరుఁడైన భా ♦ ర్గవరాముశౌర్యము
రాణింపుఁజేయురు ♦ రాజులచట
పురవైరిమిత్రుని ♦ వరవైభవంబును
బడయఁగానెంచరు ♦ వైశ్యులచట
బలరాముసేద్పును ♦ బరికింపఁగాఁబోరు
హాలసాధనోత్తీర్ణ ♦ హాలికులచట

గీ॥ పోతబోసిన బంగారు ♦ బొమ్మలనఁగ
విటులవలపించి యాడించు ♦ వేశ్యకాంత
లెందజెందటో యుండిరి ♦ సుందరాంగి
రంభయందము నిరసించు ♦ రమణులచట.

సీ॥ అట్టిపురంబున ♦ కప్పన్నచౌదరి
జేరి తటాకంబు ♦ చెంతనున్న

జమ్మివృక్షంబుల ♦ సన్నిధివసియింప
వారిరాక నెఱింగి ♦ పౌరులెల్ల
పురనాయకుండన ♦ వరలు కోటమరాజు
వంశవర్ధనుఁడు భా ♦ వప్పఁగూడి
వారిరాకకు గతం ♦ బారసి, వారల
నాగ్రామముననుండ ♦ నడుగఁజొచ్చి
నంతట నప్పన్న ♦ యందఱికిట్లను
"జనపదంబొక్కటి ♦ సాహసమున

గీ॥ గట్టియందులనివసింపఁ ♦ గలము దానఁ
బేరుపెత్తనములఁగాంచు ♦ వారమ"న్న
నంతపనియేల మీకంచు ♦ నచటిపెద్ద
లాదరంబునదోడ్తెచ్చి ♦ మోదముననుఁ.

## —: సంగన్నగారి చరిత్రము :—

వ॥ అచ్చటి గ్రామపెత్తనమున బాలిచ్చి బొడ్డుమణింబోలు గ్రామమధ్యస్థవాన ప్రదేశంబును మఱికొన్ని భూముల నొసంగి మహారణ్య సామీప్యంబున నుండు నాగ్రామమున వారికి చేదోడు వాదోడుగానుండుడని ప్రార్థించిన నంగీకరించి యచటఁ గొన్నిగృహంబుల గట్టించుకొని వసించుచున్నంత నప్పన్నగారి కుమాళ్లును బలపరాక్రమ వంతులగుటంజేసి వనంబున దుష్టమృగంబులంజంపుచు నరణ్యంబు ఛేదించి సేద్యమున కనువగునట్లు జేయుచుండిరంత వారిలో సంగన్నగారును పంచవత్సర ప్రాయంబుననే గురుశుశ్రూషం బ్రారంభించి

సకల విద్యాపారంగతుండై రాజకీయవిద్య యభిమానవిద్యగా నేర్చి క్రమంబున యౌవనవంతుండగుచుఁ దనయన్నదమ్ముల తోడ నపుడపుడు వేటకై వెడలి. 80

సీ॥ సింహరాజంబులఁ ♦ జెండాడు నొకనాడు
గజముల నొకనాడు ♦ గర్వమడఁచు
శార్దూలసంతతి ♦ మర్దించునొకనాడు
చిఱుతలనొకనాడు ♦ చీల్చివైచు
నడవిపందులమూక ♦ నడగించునొకనాడు
శరభాళినొకనాడు ♦ సంహరించు
పక్షిచయంబులం ♦ బడఁగూల్చు నొకనాడు
దుప్పుల నొకనాడు ♦ తోలివైచు

గీ॥ కారుదున్నల నొకనాడు ♦ గాల్చివైచు
పన్నగంబుల నొకనాడు ♦ బట్టియేచు
దుష్టజంతువెయ్యదియైన ♦ దృష్టిఁబడిన
నెగసికుప్పించి లంఘించి యేచిచంపు.

తే॥ విపినముల సంచరించెడి ♦ వేళలందు
క్రూరమృగముల నిట్టుల ♦ కొంచెపఱచి
నగరవాసుల కేభీతి ♦ దగులకుండ
రక్షణముజేసె సంగన ♦ దక్షుఁడనఁగ.

వ॥ ఇట్లు నిజబల పరాక్రమముచే పన్నెకెక్కి వినయ విద్యా వివేక సంపన్నుండును దేవబ్రాహ్మణభక్తుండును నగునాతనిం జూచి.

జమ్మివృక్షంబుల ♦ సన్నిధివసియింప
వారిరాక నెఱింగి ♦ పౌరులెల్ల
పురనాయకుండన ♦ వరలు కోటమరాజు
వంశవర్ధనుఁడు భా ♦ వప్పఁగూఁడి
వారిరాకకు గతం ♦ బారసి, వారల
నాగ్రామమునసుండ ♦ నడుగఁజొచ్చి
వెంటనె నప్పన్న ♦ యందఱికిట్లను
"జనపదంబొక్కటి ♦ సాహసమున

గీ॥ గట్టియుండులనివసింపఁ ♦ గలము దానఁ
బేరుపెత్తనములఁగాంచు ♦ వారమన్న
నంతపనియేల మీకంచు ♦ నచటిపెద్ద
లాదరంబునదోడ్తెచ్చి ♦ మోదముననుం.

## —: సంగన్నగారి చరిత్రము :—

వ॥ అచ్చటి గ్రామపెత్తనమున బాలిచ్చి బొడ్డుమణిం బోలు గ్రామమధ్యస్థవాస ప్రదేశంబును మఱికొన్ని భూముల నొసంగి మహారణ్య సామీప్యంబున నుండు నాగ్రామమున వారికి చేదోడు వాదోడుగానుండుడని ప్రార్థించిన నంగీకరించి యచటఁ గొన్నిగృహంబుల గట్టించుకొని వసించుచున్నంత నప్పన్నగారి కుమాళ్లును బలపరాక్రమ వంతులగుటంజేసి వనంబున దుష్టమృగంబులంజంపుచు నరణ్యంబు ఛేదించి సేవ్యమున కనువగునట్లు జేయుచుండిరంత వారిలో సంగన్నగారును పంచవత్సర ప్రాయంబుననే గురుశుశ్రూషం బ్రారంభించి

సకల విద్యాపారంగతుండై రాజకీయవిద్య యభిమానవిద్యగా నేర్చి క్రమంబున యౌవనవంతుండగుచుఁ దనయన్నదమ్ముల తోడ నపుడపుడు వేటకై వెడలి. 80

సీ॥ సింహరాజంబులఁ ♦ జెండాడు నొకనాడు
గజముల నొకనాడు ♦ గర్వమడఁచు
శార్దూలసంతతి ♦ మర్దించునొకనాడు
చిఱుతలనొకనాడు ♦ చీల్చివైచు
నడవిపందులమూక ♦ నడగించునొకనాడు
శరభాళినొకనాడు ♦ సంహరించు
పక్షిచయంబులం ♦ బడఁగూల్చు నొకనాడు
దుప్పుల నొకనాడు ♦ తోలివైచు

గీ॥ కారుదున్నల నొకనాడు ♦ గాల్చివైచు
పన్నగంబుల నొకనాడు ♦ బట్టివేచు
దుష్టజంతువెయ్యదియైన ♦ దృష్టిఁబడిన
నెగసికుప్పించి లంఘించి వేచిచంపు.

తే॥ విపినముల సంచరించెడి ♦ వేళలందు
క్రూరమృగముల నిట్టుల ♦ కొంచెపఱచి
నగరవాసుల కేభీతి ♦ దగులకుండ
రక్షణము జేసె సంగన ♦ దక్షుఁడనఁగ.

వ॥ ఇట్లు నిజబల పరాక్రమముచే పన్నెకెక్కి వినయ విద్యా వివేక సంపన్నుండును దేవబ్రాహ్మణభక్తి తత్పరుండును నగునాతనిం జూచి.

సీ॥ ద్విజరక్షణముసేయు ♦ ధీరవర్యుండెల్లు
ద్విజసమూహంబులఁ ♦ బిలుకుమార్చి
హేరంబభక్తుఁడై ♦ యొసగుచుండెడివాఁడు
హేరంబములనెట్లు ♦ లీల్గఁజేసె
చిఱుతలనెప్పుడు ♦ జేరిముద్దిడువాఁడు
చిఱుతలనేరీతిఁ ♦ జెండివైచె
శరభసన్నిధినుండ ♦ సంతసపడువాఁడు
శరభంబు లేరీతిఁ ♦ జక్కడంచె

తే॥ రాజసింహంబన యశోవి ♦ రాజితుఁడయి
సింహరాజములనదేల ♦ చెనకివైచె
నంచుదర్శించుచురు జను ♦ లప్పురమున
నతని గుణముల నేర్పుల ♦ నరసి యరసి.

వ॥ మఱియును.

ఉ॥ తేజమునందు భానునకుఁ ♦ దీటనవచ్చును బుద్ధియందునీ
భూజను లెవ్వరీతనికిఁ ♦ బోలరుశౌర్యమునందు దేవతా
రాజునుమించునోర్పునధ ♦ రావలయంబున లేడుకాదెయీ
రాజకులావతంసు సరి ♦ రాగనెవండును వేయునేటికిఁ. 85

వ॥ ఇట్లఖిల జనంబులచే మెప్పొందుచు నతండు దిన దిన క్రమంబున సవయస్కుండయ్యె నంత గొంతకాలంబున కాతండా పురపాలనంబు తనపాలంబడిన దానిం గైకొనియె నంత తద్గ్రామంబును రాచూరు భూపతికి లోబడియున్న మఱి కొన్ని గ్రామంబులను తత్పరిసరారణ్య ప్రదేశంబుల నేఁటకు త్తమం గొనవలయునను కుతూహలంబున తద్గ్రామవాసియు

రాచూరు ప్రభుపుంగవునకు మంత్రిసత్తముండునగు కోటం రాజు వెంకయామాత్యునితో స్నేహంబొనర్చి యాతని సహకారంబున సభ్యాపతి యాజ్ఞఁబొందఁదలఁచి, వలయు ధనంబును, బలంబును దీసుకొని రాచూరు కోటకుం బయనంబై పోయి యామహీధవుండగు జంగన్న రాయులవారి యాస్థానంబుఁ బ్రవేశించునపుడు.

చ॥ సతతము రాజ్యతంత్రములసారముఁ దెల్పెడుమంత్రివర్యులున్
హితులును రాజబంధువులహీనపరాక్రములైన సద్భటుల్
చతురత వేదశాస్త్రములసంగ్రహముల్ వినుపించుచున్ బురో
హితులును నిండియున్న సభ నేలికయచ్చట గొల్వుదీరినన్.

వ॥ సంగన్నగారు నాతని పరివారంబు నుత్తమాశ్వంబుల నెక్కి యచటి కరుదెంచిన నతనిం గాంచిన రాజభటులు నివ్వెరగంది త్రోవయిచ్చిన వారు గుఱ్ఱంబులందిగి సరాసరి నాభూపతి కొల్వుదీరి కూర్చుండియున్న సభావేదిక దగ్గఱకు వచ్చిననది జూచిన జంగన్న రాయభూపతియు డిగ్గనలేచి వారి నందఱను సముచితాసనస్థానంబులఁ గూర్చుండఁ జేసి "వచ్చిన కార్యంబెఱిఁగింపుఁడ"ని కోరిన సంగన్నగారిట్లనియె.

తే॥ అధిప! చామర్లపురమునం ♦ దధివసించు
కమ్మవారము మీదురా ♦ జ్యమ్మునందు
గ్రామముల గుత్తకుంగొనఁ ♦ గాఁదలంచి
వచ్చినారము మిముఁజూడ ♦ వలయుననుచు.

వ॥ ఇది నాయనుచరవర్గంబు. వీరిసాయంబుననే నెట్టి
వన ప్రదేశంబునైనను జనప్రదేశంబు జేసి వ్యవసాయ యోగ్యం
బుగ నొనర్చి యరణ్యాంతర్గత ధరణీభాగంబుగూడ సస్యఫల
భరితంబుఁ జేసెద. నాచేతిక్రింద హాలిక సహస్రంబుగలదు.
వారందఱు నాయెడవిధేయులై హలాయుధంబులచే నిలాతలం
బును మథించువారలు. ఏనును వారియొద్దననువగురీతి రాజ
భాగంబుగైకొని యుక్తకాలంబుఁదప్పక ప్రభునకు బంపు
పూనికగలవాఁడను. సమ్మతియగునేని మాకు మీగ్రామము
లలోఁ గొన్నిఁటి నిజారా కనుగ్రహింపవలయునని పలికి
యున్నంత సంగన్నగారి యనుచరులిట్లనిరి. 90

సీ॥ శరభశార్దూలాది ♦ సర్వదుష్టమృగాళి
క్షణములోఁ బరిమార్పఁ ♦ గలము మేము
మోకులు విరుగని ♦ ముదిచెట్లనైనను
ఘడియలోపల ద్రుంపఁ ♦ గలము మేము
ధరణి బ్రద్దలుజేసి ♦ తగురీతి సేద్యంబు
సులువుగాచేయింపఁ ♦ గలము మేము
వైరుల నాజిలోఁ ♦ బరిమార్చి విఖ్యాతి
క్ష్మానాథునకుఁ గూర్పఁ ♦ గలము మేము

తే॥ రాజభాగంబు చిటుకలోఁ ♦ రైతులకడ
పైరుపంటల నన్నిఁట ♦ భద్రపఱచి
జాగుసేయక భూపతి ♦ సముఖమునకు
కప్పములతోడఁ బంపింపఁ ♦ గలము మేము.

క॥ మానాయకుండు సంగన
బూనినకార్యములనన్ని ♦ మోదమెల్లర్చ్చన్
బూనికతో సాధింతుము
భూనాయక హారికిమ్ము ♦ పురములగుత్తన్.

వ॥ ఇట్లుపల్కిన నాభూపతియు నంతం దన మంత్రి వర్యుండగు కోటంరాజు వెంకయామాత్యునిం బిలిచి యడిగిన నాతండును తనసమ్మతింజెప్పె. పిమ్మట నాయాగ్రామంబుల నీయ నిర్ణయించిన యేర్పాటులన్నియు వారికిఁ దెల్పుమని ప్రభుండు బల్కుటయు నతండును వానిని విశదీకరించె. అంత సంగన్నగారమ్మహీపతి మంత్రిపుంగవుండు పల్కిన నియమంబుల కియ్యకొనిన.

క॥ వెడద యురస్థలవీరుల
కడునుత్సాహకలనంబుఁ ♦ గాంచియునపుడా
పుడమిపతి యొసఁగె గ్రామము
లడవులిజారాకునెక్కఁ ♦ డాదరణమునన్.

వ॥ ఇట్లు సంగన్నగారును దనకువలయువాని నిజారాకు నేర్పఱచుకొని వానికిఁగా భూధవునకుఁ జెల్లింపవలయు పూలవరహాలమొత్తముం జెల్లించి సెలవుఁగైకొనియె. 95

క॥ ఈరీతిఁ గొన్నివర్షము
లారాచూరు ప్రభుకడకు ♦ నమరావతికిన్
భూరమణు నొద్దకుంజని
కోరినగ్రామములనన్ని ♦ గుత్తకుఁ గొనుచున్.

వ॥ చామర్లపురి నాబడు తనగ్రామంబు, వడ్లమూడి, శెలపాడు, శేకూరు, యడ్లపల్లి, అంగలకుదురు, చినరావూరు, పెనుగుదురుపాడు, ఈమని, పరిమి, కూచిపూడి, నారాకోడూరు, మందూరు, చినగాదెలవఱ్ఱు, పెదగాదెలవఱ్ఱు, యామఱ్ఱు, దేవరాయపల్లి మున్నగు పెక్కుగ్రామంబులను తత్పరిసరారణ్యప్రదేశంబుల నిజారాకుఁబడసి యందు.

క॥ అడవుల ఛేదమొనర్పఁగ
గడిదేరిన వీరజనని ♦ కాయము సతతం
బడుగునకు మడుగులొత్తఁగఁ
దడయక సేవ్యానుకూల ♦ ధారుణిఁ జేసెన్.

వ॥ అట్లు జేయునపు డవ్వనంబులందు.

క॥ కడుదుష్ట మృగ సమూహము
తడబాటున బారిపోవఁ ♦ దఱుముచువానిన్
మిడిసిపడువానిఁ బొంచియు
నడిఁగనిపఱిమార్చుచుండి ♦ సాహసమొప్పన్.

వ॥ ఇట్లకాంతారమ్ముల దుష్టజంతువులం జంపుచు నిరంతర పరిశ్రమచే వానిని వ్యవసాయ యోగ్యంబులగు తావులుగా నొనర్చియంత. 100

తే॥ పైరుపంటలఁ బట్టియు ♦ వేరుపఱచి
భూములన్నిఁటి తగినట్టి ♦ మూల్యమునకు
కర్షకుల కెల్లరికిఁబంచి ♦ ఖ్యాతిఁ గాంచె
గ్రామపాలకుఁడైన సం ♦ గన్నగారు.

తే॥ రైతులెల్లదినిందన ♦ రాజ్యజనుల
వోలెగాపాడుచునువారి ♦ మేలుకొఱకు
జీవితముధారవోయుచు ♦ నీవిధమున
సర్వజనమాన్యుఁడయ్యెనీ ♦ సరసగుణుఁడు

వ॥ మఱియు.

సీ॥ హాళికులిచ్చెడి ♦ యల్పలాభముతోడ
ధనదునిమించిన ♦ ధనికుఁడయ్యె
నిరతాన్నదానంబు ♦ నేర్పుతో జేయించి
ఖ్యాతిమీరినమేటి ♦ దాతయయ్యె
విద్యావివేకంబు ♦ వినయసంపన్నతఁ
గలిఁగి నిర్మలయశః ♦ కాంతుఁడయ్యె
ధర్మసూక్ష్మంబుల ♦ తగవులంజెప్పుచుఁ
బురవాసులకు న్యాయ ♦ మూర్తియయ్యె

తే॥ బుధజనంబులకుంగల్ప ♦ భూజమయ్యె
దీనయాచక జనకామ ♦ ధేనువయ్యె
సత్కవీశ్వరోద్యానవ ♦ సంతుఁడయ్యె
సంగయాఖ్యుఁడెల్లరికిట్లు ♦ శ్లాఘ్యుఁడయ్యె.

వ॥ మఱియునితండు. 105

సీ॥ శ్రీపార్వతీసతీ ♦ చిత్తాబ్జభృంగుని
గంగాసమేతుశ్రీ ♦ సంగమేశు
గూడలిస్థలవాసుఁ ♦ గులదేవతగనెంచి
నిత్యమాదేవుస ♦ న్నిధికి నరిఁగి

స్థిరభక్తిచేఁ బ్రదక్షిణాలనుగావించి
సంగమేశ్వరునంత సంస్తుతించి
భూసురాదులు మంత్రపుష్పంబుఁ జెప్పఁగా
నాసక్తితోఁ దాని నాలకించి

తే॥ ధర్మకర్తయొతనరిన తనకుటుంబ
పుత్రపౌత్రాభివృద్ధికై పుడమి దేవు
లమ్మహాదేవుకడఁ జెప్ప నట్టిసూక్తు
లకు ముదంపశియిలుసేరు లలితయశుఁడు.

వ॥ ఇట్లాతండు నియమంబుదప్పక సంధ్యాకాలంబున జరుగు దేవపూజాసమయమ్మునకు దేవునిసన్నిధికిం జేరి యాతని గొల్చుచు నధికభక్తియుక్తుండయ్యె నంత గొంతకాలంబున కాగ్రామములోని భూములను గొన్నింటిని స్వామివారికై వేరుపఱచి,

సీ॥ సంగమేశ్వరుని యుత్సవవైభవంబుల
త్యంతశోభనొనర్పఁ గొంతభూమి
నిత్యనైవేద్యాది నియమములొనరింప
నర్చకులౌ వారి కమితభూమి
వేదమంత్రనియుక్త విధిఁబూజలొనరించు
స్వస్తివాచకులకుఁ జాలభూమి
నృత్యంబుగానంబు నిత్యమ్ముసేయఁగా
దేవదాసీలకు దివ్యభూమి

తే॥ మేళతాళములకుఁగొంత మేటిభూమి
మాన్యములుగాగయొసఁగెఁ బా మాన్యవరుఁడు

బండుగలనుత్సవాదుల ♦ ఖండముగను
జనుగునేర్పాట్లు వెనువెంటఁ ♦ జాలఁ జేసె

సీ॥ అర్థిజాలంబుల ♦ నరసివీక్షించెనా
మందారనామంబు ♦ మాసిపోవు
క్రూరాత్ములగువారి ♦ నేరిశిక్షించెనా
కాలపాశములేని ♦ కఱవుదీరు
దీనజనావళిఁ ♦ బూనిరక్షించెనా
బిరుదాంకితుఁడులేని ♦ పేరువాయు
ధర్మనిర్ణయబుద్ధిఁ ♦ దనరిలక్షించెనా
మనువుగల్గనిలోటు ♦ మందగించు
తే॥ వాక్సుధారస మహిమచేఁ ♦ బ్రజలఁ దనుపఁ
గా సుధాభావమిసుమంతఁ ♦ గానఁబడదు
వసుమతీచక్రమందున ♦ పారయశముఁ
గాంచి సంగాహ్వయుండువ ♦ ర్తించునపుడు.

క॥ తనకీర్తి యష్టదిక్కుల
నెనయమహావైభవమున ♦ కిరవై యతఁడున్
ధనధాన్యసంపదలచే
ననువొందఁగదివ్యభవన ♦ మచ్చటఁగట్టెన్. 110

సీ॥ తళుకుబంగారూద ♦ ధళధళత్కాంతిని
సౌధకుడ్యంబుల ♦ సరణిఁగాంచి
కలిత శీతల శిలా ♦ తలములవిలసిల్లు
కొల్వుకూటంబుల ♦ చెల్వుఁగాంచి

పాలసంద్రముతోడ ♦ మేలమాడఁదోడంగు
భోజనశాలల ♦ పొలుపుఁగాంచి
యంతఃపురంబుల ♦ చెంతనొప్పారెడు
సుందరోద్యానంబు ♦ సొబగుఁగాంచి

తే॥ చారుతర కేళిగృహముల ♦ సౌరుఁగాంచి
యాణిముత్యంపుముగ్గుల ♦ ననువుఁగాంచి
కెంపురుచిసింపుదివ్వెల ♦ సొంపుఁగాంచి
దివ్యసదనంబుగాఁబ్రజ ♦ దీనిగాంౘు.

వ॥ అట్టిసౌధమ్మున సంగన్నగారు వసించుచు నప్పు డప్పుడు తన యిజారాలోని గ్రామములం దిలకించుటకై యందలంబెక్కి వెడలుచు నాయాగ్రామముల నిల్చునప్పుడు చామర్లపుర జలం బారోగ్యదాయకమగుటంజేసి దానినే తెచ్చుట కాజ్ఞాపించుటయు.

క॥ ఎల్లవిధంబుల మేలఁగు
చల్లని కూపోదకంబె ♦ శ్రమయనకభటుల్
ఉల్లాసమునను దెత్తురు
పల్లెలలో నతనిస్నాన ♦ పానంబులకున్.

తే॥ చామరల్పురినిర్మల ♦ జలముదినముఁ
గావడులలోన వచ్చుటం ♦ గనిన ప్రజలు
భటుల సేవకునబ్బుర ♦ పడెడివారు
చెల్లుఁబడియున్న నితనికే ♦ చెల్లుననుచు.

వ॥ మఱియు నతండు. 115

సీ॥ రాచకార్యనిమగ్న ♦ లాలసుఁడై రాజుఁ
గ్రక్కునఁ గననేగు నొక్కవేళ
భూరిదానంబులఁ ♦ బుడమిదేవతలకు
వెక్కసంబుగనిచ్చు ♦ నొక్కవేళ
అలసటజెందిన ♦ నసివారునాలకీ
నెక్కిపోవుచునుండు ♦ నొక్కవేళ
సౌధాంతరమ్మున ♦ సరసభాషణముల
మిక్కుటంబుగఁబల్కు ♦ నొక్కవేళ

తే॥ నుగ్రమూర్తియై దండించు ♦ నొక్కవేళ
నుపకృతులఁజేయు రైతుల ♦ కొక్కవేళ
నుల్లసితగోష్ఠిఁగడపెడు ♦ నొక్కవేళ
నూపిరాడని పనిఁజేయు ♦ నొక్కవేళ.

తే॥ ఉర్వీపతిఁబోలు భటులందు ♦ నొక్కవేళ
నులుకుఁజెందిన ప్రజఁగాంచు ♦ నొక్కవేళ
నుబుసుపోకకై పఠియించు ♦ నొక్కవేళ
నున్నతాదర్శముల నెంచు ♦ నొక్కవేళ.

వ॥ ఇట్లు మెలంగుచు యశోవంతుఁడైన సంగన్నగారుండె.
నీకథ యిట్లుండ.

క॥ వితరణదీక్షాదక్షిణ
చతురవచోద్ధితవినీత ♦ చారిత్ర మహా!

ద్భుతశాస్త్రపరాయణ! వి
శ్రుత కమ్మకులాబ్ధి తరణ! ✦ సుగుణాభరణా.

దుగ్ధవతీవృత్తము- శూరవరేణ్యా! ✦ సుందరగాత్రా!
సారసనేత్రా! ✦ సజ్జనమిత్రా!
భూరివివేకా! ✦ పుణ్యచరిత్రా!
సారవిచారా! ✦ సంగయపుత్రా!

గద్య

ఇది శ్రీపరమేశ్వర కరుణాకటాక్షవీక్షణ ప్రసాదిత
కావ్యరచనా కౌశల కొత్తవంశ సుధాకర
శివలింగయాఖ్య పుత్రభావయాఖ్య
విరచిత శ్రీసంగ భూపాలీ
యాంతర్గత
ప్రథమాశ్వాసము
సంపూర్ణము.



శ్రీ ర స్తు.

# స ం గ భూ పా లీ య ము

## ద్వి తీ యా శ్వా స ము.

—:o:—

కం॥ శ్రీనారాయణదేవ
ధ్యానకళాచతుర! వివిధ ♦ ధర్మవిచారా!
మానిత సుజనవశీకర!
మీనాంబాగర్భజనిత ♦ మేరుగభీరా.

వ॥ అవ్వలికథావృత్తాంత మవధరింపుము.

—— కాకానిపురంబున సీతారామవర్యుండు
కౌమార్తెం గాంచుట. ♦——

సీ॥ శ్రీమన్మహాలక్ష్మి ♦ స్థిరచిత్తయనుకీర్తిఁ
గడియించె నెచ్చోట ♦ కాపురమున
ధర్మదేవతసౌఖ్య ♦ దాయకంబుగవాస
మేభూమి యాశ్రయం ♦ బిచ్చెమనిచె
విద్యానవద్య వై ♦ శద్యవిశాలయా
వాణికి నేతావు ♦ వాసమయ్యె
ధైర్యవీర్యస్థైర్య ♦ శౌర్యగాంభీర్యముల్
నివసింప నేసీమ ♦ నెలవొసంగె

తే॥ నాంధ్రకర్ణాట రాజ్యాది ♦ వ్యస్థలంబు
వితతచారిత్రకము కొండ ♦ వీడునంగ
ఖ్యాతిఁగనెన్ది? దానఁ గా ♦ కానిపురము
సంపదలకెల్ల నిలయంబు ♦ సౌఖ్యదంబు.

ఉ॥ ఆనగరిన్ వసించు సుగు♦ణాఢ్యుఁడు కీర్తిరమాధవుండు, వి
ద్యానయశోభితుండు విబు♦ధప్రకరాభినుతుం డనూనధీ
మానితుఁ డింద్రవైభవ స♦మాన మహావిభవాభిరాముఁడౌ
మానవనాథుఁ డొక్కఁడు స♦మానబలుండనివన్నె కెక్కఁగన్

వ॥ అతండును గమ్మవంశంబునం జనించి పమిడిపాళ్లగోత్రుండై గజ్జెం సీతారామచౌదరి నాబరఁగి ప్రసిద్ధిగాంచె నతని కీర్తి నల్దెసల వ్యాపించియుండె. 5

తే॥ ఆమహాపురుషునకు నొక్క ♦ యనుఁగుపుత్రి
కలిగె శుభలగ్నమందున ♦ కాంచనాంగి
సర్వలక్షణసముపేత ♦ సారసాక్షి
నేత్రపర్వంబు నొదఁగూర్చు ♦ నెలతమిన్న.

వ॥ అక్కాంతామణియు శుభలగ్నంబున జనించుటం జేసి యత్యంత కుతూహలంబున నుత్సవంబులు సేయించి రంత బారసాలదినంబున.

తే॥ తల్లిదండ్రులు ప్రీతులై ♦ యుల్లమందు
కొమరితకు నచ్చమాంబను ♦ గూర్చు నామ
కరణ మొనరించి యెంతయు ♦ గారవమున
బెంచుచుండిర మేయంపు ♦ ప్రేమతోడ.

తే॥ తేతపూదీవవోలె నా ♦ లేమదినది
నాభివృద్ధిని గాంచుచు ♦ నతిశయిల్ల
నైదు వత్సరములు చనె ♦ నంతలోన
దండ్రి గురువును రప్పించి ♦ తనయఁజూపి.

క॥ నావంశతిలకమగు నీ
పావనచారిత్ర సుస్వ ♦ భావాంచితయా
దేవిని యచ్చాంబనుగాని
వేవిద్యాప్రౌఢఁజేయ ♦ వేడెద మిమ్ముల్.

తే॥ వినయమున బల్కునాతని ♦ కనియె గురుఁడు
ప్రేమపూరితచిత్తుఁడై ♦ కామితార్థ
సిద్ధియగు మీకు నంపుడీ ♦ చిన్నతనయ
విద్యలందున దక్షఁ గా ♦ వింతు నింక.

వ॥ అట్లు పల్కిన తదనంతరం బాకన్యం బాఠశాల కంపుటయు నామె.

తే॥ అంత గురుబోధనంబున ♦ నఖిల విద్య
లందు వేదాంతవిద్యల ♦ యందు మిగుల
నారితేరి విఖ్యాతయై ♦ యతిశయిల్లి
పసిఁడికిని తావియబ్బిన ♦ భాతినుండె.

వ॥ అక్కన్యయునట్లు విద్యాసంపన్నత వన్నెకెక్కె.

సీ॥ శారికాశుకపిక ♦ సంఘంబులకు విద్య
జక్కఁగ,బోధించు ♦ నొక్కవేళ
హంసరాజంబుల ♦ కతిమందయానంబు
మక్కువతో నేర్పు ♦ నొక్కవేళ

బొమ్మరిండ్లనుగట్టి ♦ పూబోడులకుఁబంచు
నుచిత ఫలాహార ♦ మొక్కవేళ
చిక్కరాయనికాంతి ♦ చెక్కులఁబ్రసరింప
నిక్కి శృంగారించు ♦ నొక్కవేళ
తే॥ ఉపవనంబుల విహరించు ♦ నొక్కవేళ
నుయ్యాలలనూగు చెలులతో ♦ నొక్కవేళ
నుత్పలాంబు క్రీడలఁదేలు ♦ నొక్కవేళ
నుత్సుకత గాన మొనరించు ♦ నొక్కవేళ. 15

సీ॥ సావిత్ర్యరుంధతీ ♦ జనకజాదుల కథల్
మించినగోర్కె ♦ బఠించుచుండు
వీరపత్నులటంచు ♦ పేరొందు కాంతలఁ
గదనంపు చిత్రముల్ ♦ గాంచుచుండు
వృద్ధదంపతులకు ♦ వినిపించి సత్కథల్
ప్రీతితోవారి మె ♦ ప్పించుచుండు
దాసబృందముసేయు ♦ తప్పొప్పులకు కోప
గించక నెప్డు మ ♦ న్నించుచుండు
తే॥ చెలులతో కందుకక్రీడ ♦ సలుపుచుండుఁ
బుణ్యకాంతలఁజూడఁగఁ ♦ బోవుచుండు
భాషణంబుల సత్యంబె ♦ పలుకుచుండు
కాంచనాంగియునిట్లువ ♦ సించుచుండ.

క॥ బాలక విస్తృత విమల క
పోలక లకంఠకంఠి ♦ భూరిసుగుణ సం

శీలఁ విద్యాబుద్ధి వి
శాలఁ బొడఁగాంచి యాపె ♦ జనకుఁడు తనలోఁ.

మ॥ పదిరెండేండ్లగిమించెఁ బాలకువయః♦ప్రావిర్భవంబయ్యెనా
కుదయంబయ్యెనగణ్యచింతమనమా ♦ యుద్వేగముంబొందెనె
మ్మదిగానుండుటశూన్యమయ్యెనికనే♦మాడ్కిఁ వరుఁ సద్యశో
విదితుంగూర్పఁగలాఁడనో యనిశముఁ ♦ విభ్రాంతి వాటిల్లెడిఁ

తే॥ అనుచు నెదఁ జింతనజింతించు ♦ నవసరమున
నామహీపాలు సద్ధాంగి ♦ యరుగుదెంచి
యేలయిట్లువిచారింప ♦ నేమిఫలము ?
కాకవినరె 'శుభస్య శీ ♦ ఘ్రమ్మ'టంచు.

వ॥ కావున మన కన్యకారత్నంబునకుం దగువరుని వెదుకం
బురోహితుల గ్రామంబులకుం బంపుడనుటయు. 20

క॥ అకరణి భార్యపల్కిన
భూకాంతుఁడు సంతసించి ♦ భూసురవరులఁ
శ్రీకరులను రప్పించియు
సాకల్యముగావచించె ♦ సరసపుఫణితిఁ.

వ॥ గురూత్తములారా! మత్కుమారీరత్నంబు పరిణయ వయ
స్కయయ్యెఁ గాన సత్కుల సంజాతుండును, సద్గుణశోభి
తుండును, సౌందర్యమూర్తియు, సకల విద్యాపారంగతుం
డును, నగు నొక్క వరుని వెదకిరండని చెప్పి వారికుచిత
రీతి సమ్మానంబులిచ్చి పంపిన వారును జనిచని.

క॥ పురములఁ బల్లెల వెదకుచు
వరుఁడగువానిఁ గనఁగొనమి ♦ వ్యసనము హెచ్చన్
గిరిగిరి సమితులనన్నియు
నరవరగురువర్యులట్లు ♦ నానావిధులన్.

వ॥ అట్లెచ్చోటనుం దగువరునింగానక విసిగి వేసారి.

తే॥ తుదకు చామర్లపురమున ♦ వెదుకనేగి
దానిసౌభాగ్యగరిమ సం ♦ తసముఁజెంది
మారసుకుమారు సంగన్న ♦ గారిఁ గాంచి
వనితకీతఁడె తగినట్టి ♦ వరుఁడటంచు. 25

—: విప్రులువచ్చి సంగన్నగారివృత్తాంతమును
సీతారామవర్యునకు జెప్పుట :—

వ॥ అట్లెంచి సంతుష్టాంతరంగులైన యాపురోహితులు మరలి వచ్చి తమ భూపతికడకుంజని యిట్లనిరి. "కమ్మకులావతంసమా! మేము తిరిగిన ప్రదేశంబుల నన్నిఁటఁ దగు వరుఁడు లభింపమిఁ దుదకు చామర్లపురంబున కేగితిమి. అచ్చట మనకుదగిన వరునిజూచితిమి. ఇఁక నాపుర విశేషం బెట్లనిన.

సీ॥ పచ్చనితోరణా ♦ లెచ్చటఁజూచిన
వెలయుచునుండు నే ♦ వేళయందు
బహువిధాలంకార ♦ గృహములు నుద్యాన
వనములు మెండుగా ♦ దనరుచుండు

నేనేశఁగాంచిన ♦ నెల్లెడలను శుభ
కార్యముల్ పెక్కులు ♦ గ్రాలుచుండు
నిరతంబు దానంబు ♦ నెరపెడిపుణ్యులు
కనఁబడుదురుగాని ♦ కలుగరోగులు

తే॥ ఇట్టిదట్టిదటంచును ♦ నెంచరాని
పురముసొబగును, నంగళ్ళ ♦ పొలుపుకీర్తి
ధాతకైనను సర్పాధి ♦ నేతకైనఁ
దరమె వర్ణింప మాదుర్గ ♦ పురవరంబు.

తే॥ నారికేళాది తరువు ల ♦ పారమచట
సాలవృక్షంబులును వేన ♦ వేలుగలవు
జంబుజంబీర దాడిమీ ♦ నింబభూరు
హంబులకు లెక్కలేకుండు ♦ నప్పురమున.

తే॥ అష్టదిగ్గజములఁబోలు ♦ నట్టికరులఁ
బంచకళ్యాణులాది ♦ యశ్వములు, గలిఁగి
కలువపుష్పముల్ విలవిల్లు ♦ కొలకులుండ
నొప్పుచుండును వనవాటి ♦ యప్పురమున.

క॥ నానావిధపరిమళముల
నీనెడు తరుసంచయముల ♦ నింపారంగా
గానన గు నచటఁగల యు
ద్యానవనంబులను మఱువఁ ♦ దరమే మాకున్. 30

క॥ మోదమునఁ జల్లియొక్కఁడు
మాదిగలుగలట్టి వస్త్ర ♦ మాన్యులు రైతుల్

కేదారకములఁ గాంచెద
కేదుర్భిక్షంబులేక ♦ హెచ్చగుపంటల్.

సీ॥ శరణన్న పగతురఁ ♦ జంపగ మదినెంచ
రమ్మహానగరిని ♦ గమ్మవారు
ఏ దీనులడిగిన ♦ లేదనివచియింప
రమ్మహానగరిని ♦ గమ్మవారు
అన్యుల సాయంబు ♦ నాశింపఁగానెంచ
రమ్మహానగరిని ♦ గమ్మవారు
దుండగంబు లొనర్చు ♦ దుష్టుల శిక్షింతు
రమ్మహానగరిని ♦ గమ్మవారు

తే॥ సాహసౌదార్యవంతులు ♦ సద్గుణనిధు
లమ్మహానగరంబున ♦ గమ్మవారు
దేవభూదేవ భక్తులై ♦ తేజరిల్లి
రమ్మహానగరంబున ♦ గమ్మవారు.

సీ॥ దానధర్మాది స ♦ త్కార్యంబులందున
గణనకెక్కినవారు ♦ కమ్మవారు
పరరక్షణోద్యోగ ♦ పరిపాలనంబున
ఖ్యాతిఁగాంచినవారు ♦ కమ్మవారు
కడుభయంకరములౌ ♦ కదనరంగములందు
ఘనతఁగాంచినవారు ♦ కమ్మవారు
ప్రాణముల్ గోల్పోవు ♦ పాటువచ్చినగాని
కల్లలాడనివారు ♦ కమ్మవారు

తే॥ కవిజనావళిఁ బ్రోతురు ♦ కమ్మవారు
కరుణగలవారు రసికులు ♦ కమ్మవారు
కలిమిచేదులఁ దూగెడు ♦ కమ్మవారు
కమ్మవారి వర్ణింపఁ ద ♦ రమ్ముగాదు.

వ॥ వారిలో నొక్క యనఘుండు మహాపురుషుండు కొత్తవంశ పయఃపారావార రాకాసుధాకరుండును పసుకునూళ్ళ గోత్రోద్భవుండును నప్పన్నగారి కైదవ పుత్రుండునగు సంగన్న నామధేయుండు వసించుచుండు. అతండు ప్రభువు లందఱియొద్ద గ్రామంబుల నిజారాకుఁగొని రైతుల కా యాగ్రామముల భాగించి యిచ్చుచు నాగ్రామముల కధీశుండై, విశేష కీర్తివంతుఁడై యొప్పు. ఆతఁడింక నవివాహితుండు. మీరు కోరిన గుణంబులన్నియు నాతనియం దొప్పుచుండు. ఇంక నాతఁడెట్టివాఁడనిన.

సీ॥ సత్యమే వ్రతముగా ♦ సంచరించును గాని
యాడితప్పగబోని ♦ యకలుషుండు
శరణన్న పగతుల ♦ కరుణించునేగాని
దండింపనట్టియు ♦ ద్రానయశుఁడు
పెద్దల సూక్తులఁ ♦ బ్రేమతో వినుగాని
నిరసించి మెఱుఁగని ♦ సరసగుణుఁడు
జనముల నందఱ ♦ సమతఁజూచునుగాని
మతభేదమెంచని ♦ మానితుండు

తే॥ అతని గుణగణములకెల్ల ♦ నతఁడె సాటి
గాని యన్యులెవ్వారును ♦ గారుసాటి
పోల్చికొనుటకునైన నీ ♦ భూమినెందుఁ
గాంచలేమట్టి వానినొ ♦ క్కరునినైన. 35

వ॥ మఱియు.

సీ॥ ఎవని సంతర్పణ ♦ లవని విజృంభింప
నాదిభిక్షుకుభైక్ష ♦ మాగిపోయె
నెవని యాదరణంబు ♦ కవివర్యులకుఁ గల్గ
నిందిరా భారతు ♦ లేకమైరి
యెవని యారాధన ♦ మినుముడించుటఁ జేసి
శైలేశుఁడేధరా ♦ స్థలికి డిగ్గె
నెవని పరాక్రమ ♦ మేపారుటం జేసి
పరశురాముని పేరు ♦ భంగపడియె
తే॥ నెవని భక్త్యతిశయమున ♦ కీశ్వరుండు
మెచ్చి శ్రీసంగమేశుఁడై ♦ మేలుఁగూర్చె
నట్టినిర్మలచారిత్రుఁ ♦ డార్యవరుఁడు
సంగయాఖ్యుండు లోకవి ♦ స్తారయశుఁడు.

వ॥ కావున నమ్మహాపరాక్రమవంతునకు మన యచ్చమాంబ నిచ్చి వైవాహికంబొనర్చుట లెస్సయని పలుకు బుధవర్యుల మాటల నాలకించి సీతారామచౌదరియు నట్టి ప్రముఖుండగు సంగన్నగారి నెట్లిచటికి రప్పించి తన యనుంగు కూతున కతనికన్యోన్యానురాగముఁగల్గఁజేయ నగునో యని తలంచుచుండె నట్లుకొన్ని దినంబులుగడచిన.

—♦ సంగన్నగారు కాకాని పురంబున కేతెంచుట ♦—

తే॥ దైవవశమున నెద్దియో ♦ దగిలి రాచ
కార్యనిర్వాహణమున సం ♦ గన్నగారు
నుత్తమాశ్వంబొకటి యెక్కి ♦ యూరు వెడలి
సేవకులతోడ కాకాని ♦ జేరవచ్చె.

వ॥ అంత సీతారామవర్యుం డెదురేగి వారల దన యింటి కతిథిగా రమ్మని ప్రార్థించిన నాతండును వల్లెయని వెంటఁజని వారి గృహంబున గొన్నినాళ్ళు వసించి రాచకార్యంబు పూర్తిఁ జేయుచుండె. అపు డచట నచ్చమాంబ తన చెలులతో నిత్యము వనవిహారంబుల బ్రొద్దుపుచ్చుచుండె నట్టి తఱి నొక్కనా డక్కన్యయు యథావిధి స్వైర విహారంబునకై యుద్యానవనంబున కేగి యందున్న లతాకుసుమంబులంగాంచి యానందించుచుఁ దన చెలులల కిట్లనియె. 40

క॥ మల్లెలును బొన్నపూలును
గొల్లలుగా పారిజాత ♦ కుసుమములులతల్
మొల్లముగ నల్లిపొదరిం
డ్లలమురంజిల్లఁ జేయు ♦ నోసఖులారా.

వ॥ అంత.

తే॥ దృష్టిమాత్రనఁ బుష్పించు ♦ తిలకమిద్ది
ప్రీతిఁ బాడిన సుమమిచ్చుఁ ♦ బ్రేంకణమిది
పలుకరించిన నొసఁగు పు ♦ ష్పంబు గోఁగ
టుఁచు నాగన్నె లందఱు ♦ హర్షమునను.

సీ॥ చంపకంబిడు నీ మోము ♦ సొరుఁగాంచి
కౌఁగిలించిన క్రోవియు ♦ గౌరవమిడుఁ
బిల్లవాయువుఁగూర్పవా ♦ విలియు నిడెడు
నమితసౌరభ సూనంబు ♦ లంచుఁబలికె.

తే॥ కాలు మోప నశోకంబుఁ ♦ గాంచుఁబూల
హాస్తమున నంటసాలము ♦ హాసమునను
బొన్నవృక్షము వికసించి ♦ పూయుచుండు
నంచుఁబొగడిరి వనితలా ♦ యచ్చమాంబ. 45

వ॥ ఇట్లుకన్యయుం జెలులును చతురవచోసంభాషణ మొన
ర్చుచు నచ్చటనున్న సుగంధపుష్పంబుల నన్నిఁటిం
గోసికొని.

సీ॥ నిద్దంపుటద్దాల ♦ పెద్దపల్లెరమున
వర్ణశూన్యంబగు ♦ వారిరాశిఁ
గలుముల జవరాలు ♦ కాంతునిపై నల్కఁ
గొనికాపురముసేయు ♦ వనజరాశి
సరసిజకన్యకా ♦ ధరపానరక్తిచేఁ
దివిరిఝంకృతిసల్పు ♦ తేంట్లరాశిఁ
గుసుమబాణునకిది ♦ గూర్చురంగంబని
పూసికధ్వజమెత్తు ♦ మీనరాశి

తే॥ యుండలే నప్పుడొంటిగా ♦ నుండవెఱచి
శిశిరకిరణునిరాకకై ♦ జింతఁజేసి
సలిలశరణంబుఁజొచ్చిన ♦ కలువరాశిఁ
గలిగిశోభాయమానమా ♦ కొలనుఁగనిరి.

క॥ విలసితపద్మాకరమగు
కొలనుంగని సంతసమున ♦ గోమలగాత్రల్
చెలికత్తెలు నాయింతియు
జలకేళిని సలిపిరంత ♦ చతురతతోడన్.

తే॥ ఒండొరులహస్తములఁబట్టి ♦ యువిదలపుడు
నీటమున్గుచుఁదేలుచు ♦ నెమ్మొగముల
సాటిలేవని పెకలించి ♦ సరసిజముల
కలువపుష్పాదులనురాల్చి ♦ కలచిరందు.

తే॥ సారసాక్షుల మ్మాడ్కికా ♦ సారమందు
జలకమాడి నెక్కురులార్చి ♦ చందనాది
గంధలేపనముల నలం ♦ కారములను
కలితధౌతదివ్యాంబర ♦ ములఁ ధరించి.

—:సంగన్నగారు వనవిహారంబున నచ్చమాంబఁగాంచుట.:—

॥ మఱియుఁ దాము గోసితెచ్చిన నానావిధ సూనంబుల వేనలులంబెట్టి మందయాన లమందానందమ్మున మంద యానమ్ముల నావనమ్మున గ్రుమ్మరుచుండి రిట సంగన్న గారు నాయుద్యానవనంబునగల వివిధఫల పుష్పజాతుల తెఱంగులను సీతారామవర్యుని సేవకుల వలన నెఱింగి యతండు నారామవిహారాసక్తుండై యాతని వీడ్కొని యావనంబునకేగి యందొకప్రక్కఁ బ్రవేశించి యందుగల నానావిధములగు పూపొదరిండ్లను, సుగంధపుష్పంబులను ఫలంబులంజూచి యానందించుచుండె నంత నచ్చమాంబ

చెలులతో విహరించుటఁ గొంతతడవునకుంజూచి యామె సిగ్గువడునని యొక పూఁపొదరింటిచాటున దాగి యానన్య లావణ్యసౌందర్యనిధియగు నాకన్య సౌందర్యముంగాంచి యచ్చెరువందుచు నిట్లనితలంచె.

తే॥ గరుడగంధర్వ కిన్నర ♦ కాంతలందు
నాగకన్యాలలామల ♦ నరులయందు
దేవతాస్త్రీలయందున ♦ త్రిజగములను
దీనిఁబోలిన సౌందర్య ♦ తిలకయున్నె?

సీ॥ ఈపడతినిప్రేమఁ ♦ జేపట్టఁగాఁదాలి
పుణ్యంబుఁజేసిన ♦ పూజ్యుఁడెవఁడొ
యీనారిపల్కులు ♦ వీనులవిందుగా
విననోచినట్టియా ♦ ఘనుఁడెవండొ
యీరామచెక్కిలి ♦ నింపారముద్దిడఁ
దపమునల్పినయట్టి ♦ ధన్యుఁడెవఁడొ
యీవెలందిని కౌగి ♦ లింతటఁదేలించి
రమియింపఁగల్గిన ♦ రమణుఁడెవఁడొ

తే॥ ధాత్రిపై నేరికోగూర్పఁ ♦ దలఁచిమదిని
చక్కదనములనన్నిఁట ♦ నొక్కచోట
కుప్పఁగాఁజేసి తననేర్పు ♦ కొలఁదిభళిర
నళినగర్భుఁడు సృజియించి ♦ నాడుదీని.

ఆ॥ మెఱపుతీగెమాడ్కి ♦ మెఱయుజగన్మోహ
నాంగి దీనిసాటి ♦ యువనిలేదు

మోవిదొండపండు ♦ ముఖముచందురుఁడగు
నపహసించుచెక్కు ♦ లద్దములను.
తే॥ నిర్మలానంద రాజీవ ♦ నేత్రయుగము
ప్రవిమలోన్మేషపాదప్ర ♦ వాళయుగము
సారకదళీతరుస్మేర ♦ మూరుయుగము
కుందనాచలములు కుచ ♦ కుంభయుగము. 55

చ॥జిలిబిలిపైటకొంగునొకచేతనొయారముమీరఁబూనికెం
పులనిరసించుకాంతిగలమోముఁనుప్రక్కకువాల్చిసుంతనె
చ్చెలికరముఁగరంబుననుజేర్చిమృదూక్తులమెల్ల మెల్లనఁ
బలుకుచువచ్చుచుండెనుసెబాసిదియింతియొమారుదంతి యో.

వ॥ ఇట్లు తలపోయుచున్నంత నాకన్యచెలులు వేఱొక్కదెసకుఁ
గుసుమాపచయంబునకై యేగిన నక్కాంతయు నాపూ
పొదరింటఁగల పువ్వులం గోసికొనుటకై వచ్చుచున్నం
గనుంగొని సంగన్నగారిట్లని మనంబున నెంచుచుండె.

తే॥ అంచనడకల మఱపించి ♦ యువతివనన్ను
జేరఁగావచ్చు కొలఁదిని ♦ మేరలేని
సంతసము గల్గుచుండెనా ♦ స్వాంతమందు
పరువడిదినాల సంద్రముల్ ♦ పొరలునటుల.

వ॥ఇంతలో నాయింతియు నాపొదరింటిడాయంజని సంగన్నగారిం
జూచి యాతనిభువనైక మోహనాకారంబుగాంచి విభ్ర
మంబుజెందె నిట్లొండొరు లవయవ సౌభాగ్యంబుల మన
సారంగాంచునప్పుడు.

తే॥ వెలఁదికన్గొనె క్రీగంటి ♦ వీక్షణముల
ననిమిషత్వంబునం జూచె ♦ మనుజపతియు
నాయికానాయకులునిట్లు ♦ నన్యనూత్న
దర్శనసుధాబ్ధిఁ గ్రుంకిరి ♦ తనివిదీర. 60

తే॥ ప్రేమబీజములొకప్రక్కఁ ♦ బెరుగఁజొచ్చె
మోహలత కూనలునువృద్ధిఁ ♦ బొందఁదొడఁగె
కామచిహ్నంబులంతటఁ ♦ గానుపించె
మొలకనవ్వుల నుభయులు ♦ వెలయుచుండ.

వ॥ అంత నాకాంతయు సిగ్గుచే మఱొక్క పొదరింటిచాటున
కేగె నప్పుడు.

తే॥ చూపులే కమ్మవిలుకాని ♦ తూపులయ్యె
నింతి లేనగవులే ప్రేమ ♦ హేతువయ్యె
దనరు లజ్జాభరత్వమే ♦ తాపమయ్యె
నతులసందర్శనోజ్వల ♦ మతికిఁబతికి.

-:అచ్చమాంబా సంగన్నగారల యన్యాపదేశసంభాషణము:-

తే॥ ఒండొరులకీర్తియంతయు ♦ నుర్విఁబర్వ
నాలకించినవారౌట ♦ నంతకంత
కగ్గలపుప్రేమ వలపులు ♦ నతిశయిల్లఁ
బలికిరన్యాపదేశంబు ♦ భాషణములు.

వ॥ అట్లనిన సంగన్నగారక్కన్యాలలామంబుపైఁ బ్రేమనిల్పి
తనను పాణిగ్రహణంబుజేయుచు నామెను బుణ్యముందు
నని బ్రతిమాలువిధంబున నర్మగర్భంబుగా నిట్లనియె.

తే॥ మధురఫల పల్లవానీక ♦ మధువులకయి
శుకపికాళులు తరులతా ♦ సుమములఁగని
నిత్యధర్మానువర్తులై ♦ నెగడునట్లె
ప్రకృతిధర్మంబుఁ జెల్లింప ♦ సుకృతిగల్గు.

వ॥ అంతనాయింతియు నవ్వాక్యమ్ముల యంతరార్థము తననుద్దేశించి పల్కఁబడినదని యెఱింగి యాతని మనోభావంబు నింకను బరీక్షింపఁగోరి యిట్లనివచించె.

తే॥ పండ్లఁదిని శుకపికములు ♦ బయటికేగు
తేనియంద్రావిభృంగము ♦ కానరాదు
ఉదరతాపంబుదీరిన ♦ నుద్భవిల్లు
వికృతధర్మములుంగూడ ♦ ప్రకృతిఁగనమె?.

వ॥ అంత నాతండట్టి వచోమాధుర్యముంగ్రోలుచు నాశ్చర్యంబున నాయింతి వాక్యంబులకు సమాధానంబుగానిట్లనియె.

తే॥ అడవిజాతులనైజముల్ ♦ బడయువెపుడు
ప్రేమచే సాకఁబడుచున్న ♦ ద్విజనికాయ
మంబరంబున కెగసియు ♦ నపుడరావె?
సుకృతదుష్కృతములు భువి ♦ ప్రకృతి తెఱఁగు. 70

తే॥ పరిమళామృతమాసించి ♦ పంకజముల
రాజభృంగంబుజేరుట ♦ నైజమగుట
చంపకాస్వాదనములేమి ♦ సరణిఁగనవొ
వికృతసౌరభమున్నను ♦ వెగటుకాదె?

తే॥ చిలుక! నీయంద మెంతని ♦ చెప్పవచ్చు
మారునకు వాహనంబౌట ♦ మనసుగలిగె
ప్రేమఫలముల నిడినేను ♦ పెంచుకొనెద
సమ్మతంబైన నను జేరు ♦ సంతసమున.

వ॥ అంతనక్కన్య యిట్లనివచించె.

తే॥ పంజరంబులనుండెడు ♦ పక్షిజాతి
శుకనికాయంబులకు స్వేచ్ఛఁ ♦ జూడలేదు
పెంచువారలు దయచేయ ♦ నించుకంత
సంచరించుటఁ గాంచమే ♦ జగతిపైన.

వ॥ ఇదియునుంగాక. 75

తే॥ ప్రేమఫలముల నొసఁగుచుఁ ♦ బెంచుకొన్న
చిలుకలే ప్రతిక్రియయును ♦ సలుపలేవు
పలుకులను నేర్పుచుండిన ♦ బాడుచుండు
నంతియేగోరయానంద ♦ మందునవియు.

వ॥ ఇట్లాలేమ బల్కుటయు.

తే॥ సుందరాకారువదనార ♦ విందమంత
కామినీవాక్సుధారస ♦ గరిమచేత
వికసితానందదాయియై ♦ వెలుగఁజొచ్చె
సాంద్రశీతలకిరణుఁ శ ♦ శాంకుఁబోలి.

వ॥ అంత నాతఁడిట్లనియె.

తే॥ శుకమ! నీభక్తిఁ గన్గొంటి ♦ శుభముగల్గు
గాత నీపల్కు నానంద ♦ గరిమవింటి

ప్రేమరసమొల్ల నీయఁడె ♦ పెంపుఁగాంచె
కీరములఁగాంచలేదిట్టి ♦ వారినెపుడు. 80

వ॥ తుదకా పూఁబోఁడియు,

తే॥ సాలమా! నన్ను శ్లాఘింపఁ ♦ జనదునీకు
పక్షిజాలంపు ప్రేమముల్ ♦ బట్టబయలె
చక్రవాకంబులను జూడఁ ♦ జాలవొక్క
ప్రేమలేకున్న జీవించు ♦ విధముసున్న.

వ॥ అని పల్కునంత నాకామినీ కాముకు లిద్దఱు చెలిమికత్తియల కంకణ ధ్వనుల నాలించి చెరియొక్క దెసంబోయి రంత నచ్చమాంబయు చెలులం జేరి.

— ♦ అచ్చమాంబ విరహవేదనచే గుందుట ♦ —

క॥ ఏమియ్యుఁదోఁచక తిరిగెడు
నామానిని కంతకంత ♦ కతిశయమువ్యోక
కామాంధకార మిది గని
యామె చెలులు నుచితవాక్కు ♦ లాడినవినమిక.

వ॥ అక్కాంతయు బరధ్యానచిత్తయగుటం గాంచి చెలులిట్లనిరి.

ఉ॥ మేము వచించుమాటలకుఁ ♦ మెచ్చవు నేఁడిది యేమిచిత్రమో
కామిని! ధ్యానమేమియొ వి♦కారపుచేష్టలఁ జేయుచున్న నీ
మోమునుఁ జూడఁగన్పడెడు ♦ మోహసముద్రమునందు మున్గిన
ట్లేమరకుండఁ దెల్పుమిట ♦ నెల్లరు గూర్తురు నీదు కోరికల్.

వ॥ అనిన నక్కాంతయు సిగ్గుచే నెంతకుం జెప్పకున్న నాయింతు లెల్లరుం బలవంతముజేసి యడిగిన నక్కాంత యిట్లనియె.

క॥ తెలిసియు నడిగెదరే? నా
తెలివిగనుంగొనఁగనెంచు ♦ దిట్టలుమీరల్
కలరూపునైన జెప్పెద
చెలులారా! మన్మనంబు ♦ జెడిపోయెగదే.

వ॥ అని పల్కి తానావనంబునకు వచ్చినదాదిగ నటఁగన్పట్టిన నొక్కవయస్కునిం జూచి మోహించితిననియు, నాతఁడు తన మనంబు జూరగొనెననియు దెల్పిన నాచెలులును "మేమాతనిం జూడలేదు. అతఁడెట్టివాఁడో చెప్పుమని కోరిన వారికాకన్య యిట్లనియె.

సీ॥ చక్కారవిలుకాని ♦ చక్కందనము నిర
సించు దేహమ్మున ♦ జెలఁగువాఁడు
చిఱునవ్వుమోమున ♦ బరఁగుచుండెడివాఁడు
కమలంబులనుబోలు ♦ కనులవాఁడు
శ్రీకారములఁబోలు ♦ చెవిదోయిఁగలవాఁడు
నూనూగుమీసాల ♦ నొప్పువాఁడు
పదియారువన్నియు ♦ బంగారుతోసరి
దులఁదూగుమైచాయఁ ♦ గలుఁగువాఁడు

తే॥ దీర్ఘమౌబాహువులుగల్గు ♦ దిట్టకాఁడు
కలువకంటుల మోహింపఁ ♦ గలుఁగువాఁడు

విలసితవిశాలవక్షుఁడై ♦ వెలుఁగువాఁడు
నామనము దొంగిలించెనో ♦ రామలార. 90

క॥ కంతువసంతజయంతుల
సుంతైనను సరకుఁగొనని ♦ సుందరుఁడతనిన్
గాంతునిగాఁబడయుట కే
కాంత తపముఁజేసెనొక్కొ ♦ కనుఁగొనఁజాలన్.

తే॥ నిధులు పేదకునబ్బిన ♦ నెమ్మనమున
సంతసించెడురీతి నీ ♦ సరసవరుఁడు
కానుపించినదాదినో ♦ కాంతలార
మన్మనము వానిపైజిక్కె ♦ మరలదాయె.

వ॥ ఇట్లు విరహవేదనచే గుందుచున్న నక్కన్యకకు చెలిమికత్తియలు నుచితశైత్యోపచారములం గావించి సేదదీర్చి యిక్కార్యంబు బూర్తిఁజేయు భారముమాదియని వల్కిన నామెయు సంతోషచిత్తయగుటం గాంచి రంత వారందఱు నింటికింబోయి యిక్కడి వృత్తాంతం బాద్యంతము నక్కాంత జననీజనకులకు నివేదించిన వారును ముదమొందిరి. ఇట సంగన్నగారును మదనబాధచే మనోవేదనంబొంది బసకేగిన నాతని రాకకై యెదురుచూచుచున్న సీతారామవర్యుండు నాతని నెదుర్కొని తోడ్తెచ్చి సముచితస్థానంబున నాసీనుం జేసి లోకవృత్తాంతంబులు మాటలాడుచు నిష్టాగోష్ఠినుండె.

ఉ॥ అంతటఁగొన్ని నాళ్ళుచనె ♦ నాతఁడుఁగూతునొసంగుకోర్కెచే
మంతనమందు నెంచిగుణ ♦ మాన్యుఁడు సంగనకట్లుఁ దెల్పినన్

సంతసమొప్ప సమ్మతిలి♦సర్వము నాతలిదండ్రు లొప్పఁగా,
వింతమటంచు బల్కుచును♦వేగమె యప్పురిపీడిపోయినన్.

వ॥ సంగన్నగారట్లు బయలువెడలి స్వగృహంబునకే తెంచె నింతలో సీతారామవర్యుండును సంగన్నగారి తండ్రియగు నప్పన్నగారికి శుభలేఖలఁబు త్తెంచిన నతండును దానికిసమ్మ తించి బదులంపి మున్ముందు తన కుమాళ్ళలో బెద్దవారికిఁ గూడ వివాహనిర్ణయంబులుజేసి యత్యంత వైభవంబున బూ ర్తిజేయించె. పిదప సంగన్నగారి వైవాహిక సుము హూర్తము నిశ్చయింపఁబడియె నాసమయంబున. 95

—: సంగన్నగారి వివాహమహోత్సవము. :—

సీ॥ చలువపందిళ్ళ వి ♦ శాలంబుగా వేసి
యలికిముగ్గులఁ బెట్టి ♦ యలరువారు
రంగుబోయిన సౌధ ♦ రాజంబులకు వెండి
రంగులు వేయించి ♦ పొంగువారు
ప్రాతదుస్తులుమాఱఁ ♦ బనికిరావనుచును
క్రొత్తదుస్తులఁదెచ్చు ♦ కొనెడివారు
తినఁబోదుమామందు ♦ కనఁబోదుమాయని
వెండిలికింబోవ ♦ నుండువారు

తే॥ స్వర్ణరత్నస్థగితమైన ♦ వస్తువులకు
మెరుగుఁబెట్టింప ముగమున ♦ నరుగువారు
చామరల్ పురినున్నట్టి ♦ జనములెల్ల
సంగయాఖ్యుని పెండ్లికి ♦ సంతసమున.

వ॥ అంత వైవాహిక ప్రయత్నములు పూర్తియగుడుశంఖ పటహ, కాహళ, భేరీమృదంగాది సకల వాద్యంబులతోడను, నటవిటగాయక వందిమాగధ పురోహితామాత్య పుత్రమిత్ర కళత్రాదులతోడను, రాజబంధువులతోడ నుత్తమాశ్వంబులం బల్లకీల నేనుంగుల నెక్కి జాగర్లమూడి పురంబు వెడలి యప్పన్నగారును, పెండ్లికొమరుండగు సంగన్నగారితోఁ గాకాని పురంబునకుఁ దరలివచ్చె నంత సీతారామవర్యుండును.

తే॥ సౌధరాజంబలంకార ♦ సరణిఁజెంద
నాణిముత్యంపుముగ్గుల ♦ నందుఁబెట్టి
మహిత సౌందర్య కల్యాణ ♦ మంటపంబు
విశ్వకర్మచేఁగట్టించె ♦ వేడుకలర.

సీ॥ ఒకప్రక్క శ్రీరాము ♦ సకలలోకస్తుత్యుఁ
బట్టాభిషేకంపు ♦ పటముమర్చి
యొకపంక నలరాజు ♦ నకు దమయంతికిఁ
బాణిగ్రహణమైన ♦ పటమమర్చి
నొకచక్కి రుక్మిణీ ♦ సకియఁబెండిలియాడఁ
బట్టితెచ్చిన గృష్ణు ♦ పటమమర్చి
యొకచోట సావిత్రి ♦ శుకవాణి మగనితో
నటవిఁజరించిన ♦ పటముమర్చి

తే॥ యొక్కచో బ్రహ్మవిష్ణ్వాదు ♦ లక్కజముగ
వచ్చిచూచుచునున్నట్టి ♦ పటమమర్చి

దివ్యరత్నముల్ పొదిగిన ♦ తేజమలర
నచటి కల్యాణ మంటప ♦ మతిశయిల్లె.

వ॥ ఇట్టిమంటపంబున వివాహక్రియలన్నియు జరుప నిర్ణయించిన సుముహూర్తకాలంబున కచ్చమాంబ చెలులును. 100

సీ॥ కస్తూరికుంకుమా ♦ గరు కప్పురములతోఁ
జందన జవ్వాజి ♦ గంధములఁది
రమణీకుతర పద్మ ♦ రాగ మౌక్తికనీల
మణులఁ జేనొప్పు భూ ♦ షణములుంచి
లలితపల్లవపుష్ప ♦ రాజవితానవా
సనలొప్ప వానిని ♦ జడను దురిమి
చారుతమంబులౌ ♦ స్వర్ణాంబరంబులఁ
గమలాయ తాక్షికిఁ ♦ గట్టనిచ్చి

తే॥ రతియొ భారతియో శచీ ♦ సతియొ యనఁగ
నచ్చమాంబను బంపించి ♦ రవ్వివాహ
మంటపస్థితయగుటకా ♦ మానినులును
పరమహర్షాబ్ధిమగ్నత ♦ త్వరులు నగుచు.

తే॥ మారసుకుమారు బెండ్లికు ♦ మారుసంత
వివిధశృంగారముల జేసి ♦ వేదికకడ
కనుప, శాస్త్రోక్తముగఁ బూజ ♦ నాచరించి
రావధూవరులచ్చట ♦ నగ్నిసాక్షి.

క॥ సీతారామాఖ్యుండును
బ్రీతిని సంగాహ్వయునకు ♦ విభవము హెచ్చన్

గూతునుధారాదత్తగ
నాతురతం జేసె నప్పు ♦ డమ్మొవిభులకా.

తే. దీవనలఁ గానుకలను ♦ ధాత్రీసురేంద్ర
బంధుమిత్రాదులెల్లరా ♦ వధునకంత
నొసఁగి యాశీర్వదించనా ♦ యువిదకంఠ
మందు మంగళసూత్రంబు ♦ నతఁడుగట్టె.

వ॥ అప్పుడు, 105

క॥ ఆతన్వీమణిఁగొని, వి
ఖ్యాతశరత్కాలచంద్రి ♦ కాసతి సహితుం
డై తనరిషోడశాంశుం
డౌ తారానాథుమాడ్కి ♦ నావరుఁడలరెన్.

వ॥ ఇట్లు దేదీప్యమానుండై వెలుంగుచు నాతండు మాంగళ్య ధారణోత్సవంబు సలిపినంత వైవాహికక్రియలన్నియు స్వకులాచారానుగుణ్యంబుగ నెరవేర్పంబడుచుండె నంత సీతారామవయ్యందునుఁ నాతని సహధర్మచారిణియు నంపకముల కాలంబు సమీపించిన నమిత చింతాక్రాంతులగుచు బెండ్లికుమారి తెను జామాతకొప్పగించుచు గద్గదస్వరంబున నా పూబోఁడికిట్లనిరి.

సీ॥ పతిసేవనొనరించి ♦ సతతంబునాతని
హితముఁగోరిచరింప ♦ నెంచుమమ్మ
అత్తమామలనెప్పు ♦ డతిభక్తి సేవించి
కరుణాశ్రమున్ననల్ ♦ గాంచుమమ్మ

తోడికోడండ్రతో ♦ దుడుకుమాటలఁ బోరఁ
దలఁపక స్నేహంబు ♦ సలుపుమమ్మ
గృహకార్యములయందు ♦ నహరహమాసక్తి
గలిగిపూర్తిగా నొనర్పఁ ♦ దలఁపుమమ్మ

తే॥ కష్టసుఖముల ధైర్యంబె ♦ కాచునమ్మ
కలిమిలేములఁజింతిల్ల ♦ వలవదమ్మ
పుట్టినింటికై సత్కీర్తిఁ ♦ బొందుమమ్మ
మమ్మనే సమయమ్ముల ♦ మఱువకమ్మ.

క॥ తీరికగలవేళల నిం
పారఁగ సద్గ్రంథములను ♦ బఠియింపంగా
గోరుము భగవద్భక్తిని
దూరముగాఁ జేయఁబోకు ♦ తోయజగంధీ.

క॥ చెలులపయి కోపముంచఁగ
దలఁపకు బంధుజనమందు ♦ దాక్షిణ్యంబుఁ
గలిగిచరియించుచుండుము
కలికీ! సత్పుత్రతతిని ♦ గాంచివరలుమా. 110

సీ॥ పరమమౌని వసిష్ఠు ♦ భార్యయరుంధతి
వోలెఁబతివ్రతా ♦ శీలవగుము
నాథుఁగాపాడిన ♦ నారీశిరోమణి
సావిత్రివలెఁ గుణ ♦ సాధ్వివగుము
బ్రహ్మవిష్ణ్వాదులఁ ♦ బాలురం జేసిన
యనసూయమాడ్కి ధ ♦ న్యాంబవగుము

ఘోరాటవినిఁ బతిఁ ♦ జేరఁగా వెదకిన
దమయంతిభాతి సు ♦ తన్వివగుము

తే॥ వీరపత్నివై సద్యశో ♦ వినుతవగుము
ధర్మపత్నివై కార్యత ♦ త్పరతగనుము
సచ్చరిత్రవై భువిమెచ్చు ♦ జననివగుము
హెచ్చుగాఁబల్కనేలయో ♦ యచ్చమాంబ.

తే॥ ఆయురారోగ్యభాగ్యము ♦ లందిమీరు
నిత్యకల్యాణములఁగాంచి ♦ నెగడుచుండ
నన్నపూర్ణకు సమమచ్చ ♦ మాంబయనఁగఁ
ఖ్యాతిఁగల్గి వసింపుమో ♦ కంబుకంఠి.

వ॥ ఇట్లు పలికి సంగన్నగారిం జూచి యిట్లనిరి.

క॥ చేపట్టితివీపడతిని
యీపసికూన సుకుమార ♦ యెటులేలెదవో
రాపట్టి! దీని సతతము
గాపాడెదు భారమింకఁ ♦ గైవసమయ్యెన్.

తే॥ తప్పుఁజేసినమన్నించి ♦ తాల్మితోడ
దెలుపుమరలించు బుద్ధినిఁ ♦ దెచ్చుకొనఁగ
కోపమేమాత్రముంచకు ♦ కుత్సితమునఁ
బలుకువచియించు మాటలఁ ♦ బాక్షిగొనకు. 115

తే॥ సతము మీరు పురాణదం ♦ పతులఁబోలి
భారతీదేవితోఁగూడు ♦ బ్రహ్మవగిడి

నాదిలక్ష్మిగ మహావిష్ణు ♦ నమసరించి
కలసి మెలసి వసింపంగ ♦ గలుఁగుసుఖము.

తే॥ అన్నపానీయములనిడ ♦ నతివతల్లిఁ
గడుహితోక్తులఁజెప్పఁగఁ ♦ బడఁతిమంత్రి
సురతసౌఖ్యములొసఁగఁగ ♦ సుదతిరంభ
వోలెమెలఁగఁగ నీయింతి ♦ నేలుకొనుము.

తే॥చిన్ననాటినుండి ♦ పెంచిన స్నేహంబు
వలనఁ నింతఁజెప్ప ♦ వలసెఁగాని
నెఱుంగనట్టి ♦ నీతులేమున్నవి?
కలికి నచ్చమాంబఁ ♦ గరుణఁజూడు.

వ॥ అంత నక్కాంత చెలులిట్లనిరి.

సీ॥ అనిశముద్యానవనాంతం ♦ బులనెగాని
యడుగిడఁ జాలదీ ♦ యబలమిన్న
పువ్వుసెజ్జలయందుఁ ♦ బవ్వళించునుగాని
వేరుపాన్పులచెంతఁ ♦ జేరదతివ
వీణె మీటుచుఁగాని ♦ విద్యాకలనఁజూపుఁ
గాని యితరగోష్ఠిఁ ♦ గడవదార్య
పారిజాతాది పు ♦ ష్పవితానములఁగూర్చి
యల్లునన్యమెఱుంగ ♦ దంబుజాక్షి.

తే॥ బాలసుకుమార నళినాస్య ♦ వాలుఁగంటిఁ
బేల నేలీలఁ గాంతో వి ♦ లోలనటిమ
నేలఁబాలించు దొరవు నీ ♦ కేలుఁబట్టి
నీలవేణిని లాలన ♦ నేలుకొనుము. 120

వ॥ ఇట్లువల్కుచు నాకన్యచెలులుం దలిదండ్రులు నానంద బాష్పపూరిత లోచనులగుచుం దమ కన్యకారత్నంబును సంగన్నగారి కప్పగించి రట్లు వైవాహికక్రియలన్నియు వరుసక్రమంబున నైదు దినంబులు జఱుగుచుండె నప్పుడు.

తే॥ భట్టుమూర్తులకును రాజ ♦ బంధువులకుఁ
గలితస్వర్ణాంబరమ్ములఁ ♦ గట్టనిచ్చి
భూరిసంభావనలొసంగి ♦ బుధజనముల
కమిత సంతోషముంగూర్చి ♦ యంపిరపుడు.

తే॥ పప్పుకూర లన్నము పిండి ♦ వంటకములు
పచ్చడులు నూరుగాయలు ♦ పాయసంబు
లాదిగాభక్ష్యభోజ్యము ♦ లందఱకును
వెక్కసంబుగఁబెట్టిరి ♦ పెండ్లివారు.

తే॥ అన్నదానంబుపేదల ♦ కమితశ్రద్ధఁ
బెండ్లివారిచేనపుడుగా ♦ వింపఁబడియె
ధనము ధాన్యంబువస్త్రముల్ ♦ తగినయటుల
నడిగినవియెల్ల నొసఁగిరి ♦ యాచకులకు.

వ॥ ఇట్లు పెండ్లి పరిసమాప్తి యగుడు నచ్చమాంబయుఁ దన చెలులతో నేకాంతమున నిట్లనియె. 125

తే॥ దైవకృప యొండు గలిగిన ♦ ధరణిపైన
గోర్కెలెట్టివియైన జే ♦ కూరున నెడి
సత్కవుల పల్కులెల్లను ♦ సత్యములని
నేడుగద నమ్మఁజాలితి ♦ నెలఁతలార.

వ॥ ఇట్లా పెండ్లికుమార్తెయుఁ దనకనుకూల వరునిం బడయ్యుకతన నత్యంత సంతోషస్వాంతయయ్యె నంత సంగన్నగారును గొంతకాలంబట వసించి పిదప మామగారియాజ్ఞఁగొని హారొసఁగిన ధన కనక వస్తువాహనములతో నొక్కనాడు బయలువెడలి నిజపత్నీసమేతుఁడై నిజపురంబునకేతెంచె నంత వసంతఋతువు సమీపించిన.

## —♦ వసంతకాల చంద్రోదయ వర్ణనము. ♦—

తే॥ మిత్రవరుఁడగు మలయాస ♦ మీరుఁగూడి
చైత్రరథుఁడయి వెడలవ ♦ సంతరాజు
పూన్కినతనికొసంగెడు ♦ కానుకలనఁగ
దరులతాదులు పల్లవ ♦ తతులనింపె.

తే॥ పాంథులకు సర్వజనులకుఁ ♦ బ్రాణములనఁ
దరులతాకుంజములకు నా ♦ ధారములన
జంతుజాలములకు మూల ♦ సాధనమన
బిల్లవాయువుల్ మెల్లన ♦ వీవఁదొడఁగె.

తే॥ మల్లెమొల్లలు చంపక ♦ మరువకములు
జాజివిరజాజులును పారి ♦ జాతములును
నిండుగఁజిగిర్చి పుష్పింప ♦ నెగడెవాటి
ఘుమఘుమయటంచు వాసనల్ ♦ గొట్టుచుండ. 130

తే॥ తగినకాలఁబిదే వసం ♦ తమ్మటంచుఁ
దలఁచికాబోలు పికములు ♦ తనివిదీర

చిగురుజొంపముల్ మెసవుచుఁ ♦ జెట్లమీఁద
శ్రావ్యనాదంబులను జేయ ♦ సాగెనపుడు.

వ॥ అట్టికాలంబునం దొక్కనాటి సాయంసమయంబున.

తే॥ దండధరుఁడు ధరించెడి ♦ దండమనఁగఁ
గారుమేఘంబు పోలికఁ ♦ గానుపించి
యంధకారంబు బ్రహ్మాండ ♦ మంతనిండి
మిట్టపల్లములేకమై ♦ యిట్టిదనుచుఁ
గాంచలేనట్టి విధముగఁ ♦ గ్రమ్మకొనియె.

తే॥ పాకశాసన శ్రీకృష్ణ ♦ పశుపతులకుఁ
దుహినకరునకుఁ బ్రీతిమైఁ ♦ దోఁచెనిది య
హల్యగోపికా మునిపత్ను ♦ లందు దార
యందుఁగామాతురత హెచ్చి ♦ యరుగునపుడ
టంచు గులటలు జెప్పంగ ♦ నతిశయిల్లె.

తే॥ నీలవస్త్రాంబరంబు రే ♦ నెలఁత గట్ట
మెఱయునందలి ముత్యాల ♦ సరణియనఁగ
దారకానివహంబు ల ♦ పారముగను
మింటఁ బొడువంగఁ దొడఁగెను ♦ వెంటవెంట. 135

తే॥ రాజసభలందు మంత్రులు ♦ రాజహితులు
సద్భటావళి సామంత ♦ సంఘములును
చక్రవర్తికై వేచెడి ♦ చందమయ్యె
చందురుని రాక నక్షత్ర ♦ సమితియందు.

సీ॥ తెలివెన్నెలలఁగూర్చి ♦ తిమిరంపుగుంపులఁ
బారఁద్రోలెడు మేటి ♦ శూరుఁడనఁగ
గిరణసారంబుల ♦ బరచి సస్యాళికిఁ
జీవములిచ్చెడు ♦ జెట్టియనఁగ
విషరాశిజనియించి ♦ విషభరంబులఁదాటి
విషభోక్తతలనెక్కు ♦ వీరుఁడనఁగ
విరహిణీజనముల ♦ వేధించుపవమాన
కందర్పులకు చెలి ♦ కాఁడనంగ

తే॥ భానభంబులకితఁడె ప్ర ♦ భుండనంగ
ద్రిజగములవన్నెకెక్కిన ♦ దిట్టయనఁగ
శిశిరకిరణుండు తారకా ♦ శ్రేణికడకు
వెడలివచ్చెను ప్రాగ్దిశ ♦ వీడియంత.

తే॥ గగనకాసారమందున ♦ నెగడుచున్న
పాండురామ్లానకుముదపు ♦ ష్పంబనంగ
భువనసౌధరాజాంతర ం ముున వెలుంగు
దివ్యవిద్యుత్ప్రకాశిత ♦ దీపమనఁగ.

తే॥ నిండుకొల్చున నుండు ద్యో ♦ మండలాధి
పుండువరలిన యట్టుల ♦ బ్జుండుగగన
మండలంబున దోచియ ♦ ఖండకిరణ
కాండములఁ బర్వితా వెల్గు ♦ చుండెనపుడు.

తే॥ తారకానాథుతోనంధ ♦ కారవనిత
సంగమముసేయవేచియ ♦ ర్థాంగియైన

చంద్రికాసతివచ్చెడి ♦ సమయ మెఱిఁగి
సవతిపోరుభయంబునం ♦ బారిపోవె. 140

తే॥ దంష్ట్రి జైవాత్రకుండు మా ♦ ర్తాండునండ
మెండుగానుండు రేయెండ ♦ పిండిజల్లి
యుండుతెఱఁగున బఱచె భూ ♦ మండలమున
నిండునేడుకకన్నుల ♦ పండువనఁగ.

వ॥ అప్పుడు.

తే॥ చక్రవాకంబులననేల ♦ సర్వజంతు
జాలములు నంగజునిబారిఁ ♦ దూలఁజొచ్చె
నన్న నిఁకమానవుల మాట ♦ లడుగవలెనె?
చిగురుబోండ్ల సంగతిగూడఁ ♦ జెప్పవలెనె?.

## —♦ విరహిణీ జనవర్ణనము ♦—

వ॥ అట్టి సమయమ్మున మలయపవనుని మందగమనంబునకును, శుకపికశారికాది శకుంతంబుల మధుర కలకలస్వనంబులకును, చంద్రకాంతశిలానిర్మిత సౌధరాజవ్యాప్త ధవళచంద్రికా సహిత శశాంకకిరణ ప్రసారంబులకును, నానావిధ పరిమళపుష్ప సుగంధమ్ములకును, పునుగుజవ్వాజి మున్నగు సుగంధద్రవ్యస్ఫురిత ఘుమఘుమాయిత వాసనలు మేనుల హెచ్చుటకు నుల్లంబులు పల్లవింప పల్లవాధరులు మదనాగ్ని కీలలంబడి తూలుచు, సోలుచు, నుసురుసురనుచు, నాధులచెంతఁ జేరంజనువారును, విటులకై వెదుకంబోవువారును, పతుల రతి సుఖంబులఁదేలరమ్మని ప్రబతిమాలు

వారును, నింతవరకెందుండితిరని మంతనంబు లాడువారును, కంతుఁడు బాణంబు లనంతముగా వేయుచున్నవాఁడు, మా సంతాపంబుఁ దీర్పరాదే యను వారునై యిట్లు విరహానల తాపదగ్ధలగు ముగ్ధలచెంత నెంతకును మనోనాయకులు జేరి కామ్యంబులం దీర్పకున్నవారును బ్రణయకోపంబు జెంది యున్నంత నానాయకులు నత్తరుణుల బలుకరించిన కోపంబున బత్తిపీడి మారుపలుకకుండిన వారిని బ్రతి మాలువారును, నాచెంతఁ జేరరావే, నాతో మంతనము లాడరాదే, శాంతము దెచ్చుకొనవే, నీకింత కోపమేల కాంతా! యనువారును, తప్పుజేసిన సైరింపరాదె, నను నియుక్కన నొక్కి శిక్షింపరాదే యను వారును, నిక్కముగ మక్కువతో నిక్కడి కేతెంచితి నీచెక్కిలి ముద్దుల నొక్కపరి చిక్కనియ్యవే యనువారును, మారుండు నిశిత శరంబుల వేమారుగా వేయుచున్నవాఁడు, క్రూరుఁడగు నాతని బాధలంబడంజేయక వారింపఁజేయుమో నారీమణీ యనువారు, నారామువిహారాసక్తులై పొదరిండ్లకడ కేగుదమని సుదతీమణుల పాదంబులఁబట్టి మదను బారినుండి రక్షింపుమని ప్రార్థించువారును, ముద్దియ్యవే యొక్కటి యని సద్దులేక సద్దంబులంబోలు చెక్కుల నొక్కుచు ముద్దుల నొందువారును, నిగనిగల మెఱుఁగుల ప్రకాశమానమగుమగువల చెక్కుల ప్రతిబింబించు చంద్రరూపంబులం జూచి తుహినకరుండు నీముఖపద్మము దొంగిలింపవచ్చెను గదే యని పలుకుచుఁ గపటంపు భాషణంబులు వల్కి మోములఁ దిలకించుచు నధరపానంబు సేయువారునై యిట్లు

కామినీ కాముకులు మనోజవేదనచే తత్తరపాటు నొంది, చెదరిన వస్త్రంబులతో, బెదరిన చూపులతో, కదిసినకాయంబులతో, నదరిన యుల్లంబులతో, ముదిజెందిన పుష్పంబులతో, విదళించిన ముంగురులతో, రాలిన భూషణంబులతో, వీడిన కొప్పులతో నిట్లు నానా ప్రకారంబులనుండి యున్నంత.

తే॥ ప్రణయకలహంబులం బొంది ♦ పలుకకున్న
పల్లవాధరు లెల్లరు ♦ నల్లనల్ల
నన్ని జేసులం జేరనా ♦ నాథులంతం
గూర్మిం జూచిరి తొల్లింటి ♦ కోపముడిగి. 145

—♦ అచ్చమాంబా సంగన్నగారల ప్రణయకలహవర్ణనము ♦—

వ॥ అట్టి వసంతరాత్రంబున సంగన్నగా రచ్చమాంబతో జేరి

తే॥ చంద్రకాంతశిలాయుక్త ♦ సౌధరాజ
ములను చందన గంధుల ♦ లలితనృత్య
గీతవాద్య విశేషముల్ ♦ ప్రీతిమీరం
గ్రోలి యానందవార్ధిని ♦ దూలిరపుడు.

వ॥ అంతం గొంతవడి కక్కాంతలును సెలవుం గైకొని నిజనివాసంబుల కేగిన పిదప సంగన్నగారును కుసుమసాయకు పుష్పబాణసరంపరలచే వంచింపంబడి పట్టరాని తమకంబున నెట్టకేలకా కన్యం జేరి కౌగిలింపంబోయిన నక్కాంతయు సిగ్గుచే గ్రేగంటి వీక్షణంబులం దన యసమ్మతిం దెల్పుచు నావలికిం జనిన నతండిట్లనియె.

సీ॥ కాంచవే నామొరా ♦ లించవే నన్ను మ
న్నించవే యించుక ♦ చంచలాక్షి
యెంచవే నన్నుపా ♦ లించవే నొంచవే
పంచసాయకుబారి ♦ కాంచనాంగి
పలుకవే మరుని పూ ♦ ములికివే నాముద్దు
చిలుకవే ననుఁజూడు ♦ కులుకులాడి
అలుఁగకే ననువీడి తొలఁగకే ♦ నీమీఁది
వలపుచే వచ్చితి ♦ గలికిమిన్న

తే॥ మేలమాడఁగ నెంచెదో ♦ నీలవేణి
పాలముంచెదొ లేదొ నీ ♦ పాలఁబడితి
బాలతాళఁగఁజాలనీ ♦ జాలమేల?
తూలనాడక నాతోడ ♦ నోలలాడు.

వ॥ అంత నక్కాంతయు నమితలజ్జాభరంబునం బలుకక ప్రక్క
కుంబోయిన నతండును బ్రణయకలహంబు నటించిన
నింతలో. 150

క॥ మారుఁడు నిశితశరంబుల
సారసదళనేత్రిపైన ♦ జయ్యన బఱచెన్
క్రూరసుమబాణహతిచే
నారియు వెసదూలిపోయి ♦ నాథుని జేరెన్.

వ॥ అక్కాంతారత్నం బత్యంత మనోవేదనచేఁ గుందుచుఁ
గొంతసేపున కట్లు నిజనాథుఁడగ్గరి చరణకమలంబులొత్త
నుద్యుక్తయైనంత నతండును దిరస్కరించి మోము ప్రక్క
కుం దిప్పి పలుకకుండిన నయ్యింతి యిట్లనియె.

సీ॥ నేరమా, నాపైని ♦ భారమా నీకింత
వైరమా పలుకవు ♦ నీరజాక్ష
కోపమా నీకింత ♦ తాపమూలేక స
ల్లాపమా యిదియేమి ♦ భూపతనయ
మేలమా నీకింక ♦ జాలమా నన్నిట్లు
తూలిపో జేసెదు ♦ నేలచేడ
పూనుమా శాంతము ♦ మానుమా మౌనము
నేను సైదాననే ♦ మానసీయ

తే॥ భూరి తేజో విరాజిత ♦ పుణ్యమూర్తి
ధీరసాహసగుణనిధీ ♦ దిక్కు నీవె
కోరి శరణను చుంటినో ♦ జేరరావె
మారుబారికి నోర్వంగా ♦ నేరనిపుడు.

వ॥ అంత నక్కాంతుండును సంతోషిత స్వాంతుండై నిజ సతీ
మణీ ప్రార్థనల కలరుచు డగ్గరి యిట్లనియె.

సీ॥ చుక్కలదొర వెల్గు ♦ చెక్కులంటకమున్న
గ్రక్కున ముద్దిడు ♦ మొక్కమారు
పక్కిరాజులకీవు ♦ భయపడుటకుమున్న
నక్కున నను జేర్పు ♦ మొక్కమారు
అధరపానము నళి ♦ లాసించుటకుమున్న
నుల్లాసమున నిడు ♦ మొక్కమారు
మలయమారుతముచే ♦ మదిసొక్కుటకుమున్న
యువిద! కౌగిలిం జేరు ♦ మొక్కమారు

తే॥ చక్రవాకంబులును బోరు ♦ సలుపుచున్న
యున్నత స్తనములనిడు ♦ మొక్కమూరు
ప్రక్కకుం జేర్పు నాకర ♦ మొక్కమూరు
చిక్కితివి నీవి సడలింపు మొక్కమూరు. 155

వ॥ ఇట్లు మృత్తకాశిసిచి త్రజుండు చిత్తజశరాఘాతంబుల తత్తర పాటునొందిన బిత్తరి మత్తగజయానతో సరసంపు భాషణంబులఁ బల్కుచు మెల్ల మెల్లన నాయింతి కళలం గరంబునం గలంచి మఱియు.

తే॥ చుంబనాలింగనాదుల ♦ సుముఖఁ జేసి
ప్రేమపాశంబులను తన్వి ♦ బెనచువైచి
కామమోహంబులాతని ♦ గ్రమ్ముకొనఁగ
సురతకేళిని దేలించె ♦ సుదతినపుడు.

క॥ చిత్రజుబారికి వశులై
చిత్తాంభోరుహానిమగ్న ♦ శీలాచలులై
మత్తగజయానయుం బతి
యు తఱి నుపరతుల దేలి ♦ హాషణమునొందన్.

—: ప్రభాతవర్ణనము. :—

సీ॥ జారచోర పిశాచ ♦ సంఘంబులెల్లెడ
నాగంతుకాభీతి ♦ నడరిపార
క్షీరంబులొసఁగఁగా ♦ గ్రేపులు దరిలేమి
ముదవు లంబారవం ♦ బులను సలుప
దూర దేశంబులఁ ♦ జేరబోనెంచిన
బాటసారులు త్రోవఁ ♦ బయులు దేర

'కా కా' యటంచును ♦ గాకములఱువంగఁ
గొక్కొరోకోయని ♦ కోళ్లుఁగూయ

తే॥ కర్షకులు లేచి వ్యవసాయ ♦ కార్యములను
జక్కఁబెట్టుకొనుండని ♦ యెక్కుడగను
హితవుఁజెప్పుట కేతెంచు ♦ హితునివోలెఁ
బూర్వదిశ వేగుజుక్కయు ♦ బొడిచెనపుడు.

ఉ॥ తూరుపు తెల్లవారె నుదితుండయి ప్రాక్సతి జేరెఁ భానుఁడున్
దారలు కాంతిహీనముగఁ దద్దయుఁ జూడగ నయ్యె నయ్యెడన్
మారశశాంక మారుతుల మాయలు కాముకులందడంగె 'సం
సారపయోధి నీదు జనసంఘము మేల్కొనిర' న్నవింత యే?

తే॥ శంబరారినిగూడి ని ♦ శాచరుండు 160
విరహిణీబృందమును రాత్రి ♦ వేచుకతన
మిత్రుఁడీఁక శత్రువౌనని ♦ ధృతిఁదొఱంగి
బెదరి నిస్తేజుఁడై ప్రక్క ♦ కొదిగెనపుడు.

తే॥ అంధకారంబు వెన్నెల ♦ లడఁగిపోయెఁ
గిలకిలారావములను కో ♦ కిలలొనర్చెఁ
బక్షిజాలంబులన్నియు ♦ బయటికేగెఁ
దినకరునిరాక జీవులు ♦ తెలివిఁగనిరి.

తే॥ నీలకంఠుని మూడవ ♦ నేత్రమనఁగఁ
బూర్వదేసతకుంకుమ ♦ బొట్టనంగ
నరుణవసనంబుఁ దాల్చెనా ♦ నభ్రమనఁగ
నరుణుఁడుదయింప నెల్గొందె ♦ నరుణకాంతి.

తే॥ శుష్కమేఘంబులన్నిఁట ♦ సూర్యజనిత
కిరణములు బ్రసరించిన ♦ నరుణవర్ణ
దీధితులు గ్రమ్మెనాకాశ ♦ వీథినవియు
బంగరుంగొండ సెలయేళ్ళ ♦ భ్రాంతిఁదోచె.

తే॥ మిన్ను క్రమమున తెల్లనై ♦ మెరయఁజొచ్చెఁ
బ్రొద్దుపొడుపు సుమంబులుం ♦ బూయసాగె
కమలములు వికసించెను ♦ కాంతిఁయుడఁగెఁ
గలువలకు లోకబాంధవు ♦ కారణమున. 165

వ॥ ఇట్లు ప్రభాతంబైన సంగన్నగారు కాలోచిత కృత్యంబులం దీర్చుకొని వ్యావహారిక క్రియానిమగ్నుండయ్యె నంత.

క॥ సుమనోజ్ఞకరంబు వసం
తమునాతఁడు గడపెనటులఁ ♦ దనయాసక్తిన్
రమణీప్రియానురక్తిని
సమమీగంపతులు గౌరి ♦ శంకరులకనన్.

—: సంగన్నగారి సోదరుల సంతానుక్రమము. :—

వ॥ ఇట్లు గొంతకాలంబు గడచిన నప్పన్నగారి కుమాళ్ళ కంద ఱకు బుత్రులు గల్గి రెట్లనిన నప్పన్నగారి జ్యేష్ఠసుతుండగు పుట్టయ్యగారికి సంగయ్య సుందయ్యయనువారును,ద్వితీయ కుమారుండగుసుబ్బన్నగారికి జగ్గయ్య,కిచ్చయ్య, రామయ్య లును, మూడవ కొమరుండగు నయ్యన్నగారికి జానకి రామయ్య, కొండయ్య, వెంకయ్య, సుబ్బయ్య, శివయ్య లును, చతుర్థసూనుండగు వెంకన్నగారికి రఘువయ్య,

చలమయ్య, ఆశయ్య, శివలింగయ్యలును, అనవ తన యుండగు సూరన్నగారికి శివయ్యయను నాతండును జన్మించిరి. వీరిలో సంగయ్యకు అప్పయ్యయు, సుందయ్యకు కోటయ్యయు; జగ్గయ్యకు నరసయ్యయు; కిచ్చయ్యకు సుబ్బయ్య, వెంకట్రామయ్య, జగ్గయ్య, హనుమయ్య, రామయ్యయనువారును, జానికరామయ్యకు వీరయ్య, సీతయ్య, లక్ష్మయ్యలును, కొండయ్యకు హనుమయ్య, బుచ్చయ్య యనువారును, వెంకయ్యకు హనుమయ్య, చన్నయ్య, రామయ్యలును, రఘువయ్యకు వెంకయ్యయు, చలమయ్యకు వెంకయ్య, సూరయ్య, రామయ్య, శివయ్య, క్రిష్టయ్యలును, ఆశయ్యకు కోటయ్య, సంగయ్యలును, శివలింగయ్యకు కోటయ్యయు, సూరన్న కొడుకు శివయ్యకు లింగయ్య, క్రిష్టయ్య, రామయ్య, వెంకయ్యలనువారును బుట్టిరి. వీరిలో సంగయ్య కుమారుఁడు అప్పయ్య కుటుంబమువారు నరుకుళ్ళపాడు గ్రామవాస్తవ్యులైరి. సుందయ్యకుమారుఁడు కోటయ్య కాకానిపురవాస్తవ్యుఁడై యటఁ గొంతకాలము గ్రామాధికారియయ్యె నాతని వంశమట నభివృద్ధినొందె. తక్కుంగలవారు సంగమచామర్లపురవాసులై యొప్పిరి. ఇట్లుండ నప్పన్నగారి సోదరులలో సీతన్నయను నాతండును, గొంతకాలమున కాపురంబున కేతెంచిన నాతనికి పద్దన్న యను కొమరుండు జన్మించె. ఆ పద్దన్నకు రాజయ్యయు, నాతనికి క్రిష్టయ్య, రామలింగము, కోటయ్య యనువారలునుఁ బుట్టిరి. ఇంక సంగన్నగారి వంశక్రమం బెట్టనిన.

—: సంగన్నగారు కుమాళ్లం గాంచుట. :—

చ॥ ఘనుఁడగుసంగయాఖ్యునకుఁ ♦ గల్గిరినల్వురుపుత్రులూర్జితుల్
వినయవివేకశీలజన ♦ విశ్రుతసద్గుణశాలియైన పుత్రియున్ [యుల్
అనఘుఁడు నర్సయాఖ్యుఁడుగు ♦ ణాఢ్యులు భావయ,సీతయాహ్వ
వినతుఁడులింగయాఖ్యుఁడర ♦ విందదళేక్షణ లక్ష్మమాంబనాన్.

తే॥ ఇందులక్ష్మమాంబ ♦ యిందునిభాస్యను
గ్రొత్తపల్లివంశ ♦ కువలయేశుఁ
డగుమణెయ్యగారి ♦ కర్ధాంగిగానిడి
పెండ్లిజేసెనమిత ♦ ప్రీతితోడ. 170

వ॥ ఇట్లు పెండ్లిఁగావించి జామాతయగు మణెయ్యగారు పూర్వము కాపురమున్న యమృతలూరు వాసంబు బాగు లేదని తలంచి వారికొక సుందరభవనము జాగర్లమూడి పురంబున నిర్మించి యచ్చోటఁ గాపురంబుండఁజేసి వారికి వలయు భూముల సేద్యమునకిచ్చి వారిని బుత్రికా సంబంధమున నెక్కుడు ప్రేమఁ బోషించుచుండెనంత.

తే॥ నెలకువర్షముల్ మూడును ♦ నేలఁగురిసె
సస్యజాలంబు లందుచేఁ ♦ జాలహెచ్చె
కనులపండువై ధాన్యముల్ ♦ గ్రాలుచుండె
దేశము సుభిక్షమై యట్లు ♦ తేజరిల్లె.

—; అమరావతీప్రభుండు గ్రామములఁ జూడవచ్చుట. :—

తే॥ పైరుపంటలఁ దిలకింపఁ ♦ గోరియప్పు
డనుఁగు సచివుఁడు జంపాల ♦ అయ్యనాఖ్యు

తోడనమరావతీ మహేం ♦ ద్రుండవోలి
యందలంబుల పైనెక్కి ♦ యరుగుదెంచె.

తే॥ వెంకటాద్రిప్రభుండట్లు ♦ వేడ్కఁదోడ
చామరల్ పురికేతేర ♦ సంగయాఖ్యుఁ
డెదురుసనితోడి తెచ్చిన ♦ మ్ముదముమీర
నర్ఘ్యపాద్యంబులిచ్చియ ♦ త్యాదరమున.

వ॥ ప్రభువర్యునకు నమాత్య శిరోమణియగు నయ్యన్నగారికిఁ దగు బసలం గల్పించె నంత వారును దమగ్రామముల పైరు పంటలం దిలకించివచ్చిరి. వెంకటాద్రి ప్రభుండును తానిది వరకు మిక్కిలి తక్కువమూల్యమునకు గ్రామముల నిజారాకు సంగన్నగారికిచ్చి యుండుటచేతను, పైరు పంటలు బాగుగనుండుటచేతను నతండు మఱికొంతధనంబు పన్నుగా గ్రహింపనెంచి దానికై యోచించుచుండె. అంత సకల భక్ష్యంబులతో సంగన్నగారు వంటకంబుఁజేయించి కుడువంబెట్టఁగోరి స్వయముగఁ బదార్థంబులు వడ్డించి ఘృత కలశంబుదెచ్చి వడ్డింపఁబోవ ప్రభుండిట్లనియె. 175

తే॥ ఏను గోరినయట్టుల ♦ నానఁ జేసి
ముదము నొడఁగూర్చినంగాని ♦ భోజనంబు
సేయఁజాలనో యప్పనా ♦ చిన్నికోర్కె
గలదు, దానిని పరిపూర్తిఁ ♦ గానొనర్పు.

వ॥ అనిన ప్రభువర్యుని మాటలకు సంగన్నగారు దరహాసిత వదనుండై "ఇంటికన్న దైవమును, మీకన్న ప్రభుండును

నాకులేరు. మీకోర్కెకి నేను మారువల్కఁజాలుదునే” యనిపలికె నంత ప్రభుండును భుజించి యొసఁడిచ్చిన కర్పూర తాంబూల మొసర్చుచు దదుపరి మంత్రి సామంతాది నాయక పరివేష్టితుండై కొల్వుదీరి సంగన్నగారితో నిట్లనియె. “మేమిదివరకిచ్చిన గ్రామముల యిజారాల మూల్యము బహుస్వల్పము. పైరుపంటలిప్పుడు బాగుగా నున్నవి గాన మాకియ్య నేర్పఱచుకొన్న వరహాలు తొమ్మిదిచిన్నముల పరిమితిగలవిగాక, యిరువదియేడు చిన్నముల పరిమితిగలవిగా నుండుట కంగీకరించి యట్లు సుంకముంజెల్లింపవలయున”ని పల్కిన నది తనకుగాక రైతులకును నెక్కుడునష్టము గలిగించునదగుటచేతను, తానుజేసిన వాగ్దానభంగమునకు వెఱచుచు సంగన్నగారు ప్రభున కిట్లనియె.

తే॥ ధర్మమేరీతి నడచునీ ♦ ధాత్రియందుఁ
 పుడమిపతి యాడిబొంకిన, ♦ మొదటమీరు
 నిర్ణయించిన మేరకు ♦ నీతిదప్పి
 హెచ్చుసుంకంబునెట్టుల ♦ నిచ్చగింత్రు.

తే॥ పేదవారలు రైతులీ ♦ విధినిమూడు
 ‘శెట్ల’ సుంకంబునీయఁగా ♦ లేరుగాన
 గొంతయైనను దగ్గింపఁ ♦ గోరుచుంటి
 నంచుబల్కిన నొప్పఁడా· ♦ యవనిపతియు.

వ॥ అంత సంగన్నగారుఁ జాలసేపు వినయభాషణంబుల జన

పతింబ్రార్థించియు నాయన దనవాక్యంబుల కంగీకరింపమిఁ
గ్రోధంబు హెచ్చ నిట్లనియె. 180

తే॥ "ధరణిసత్యంబు వల్కుఁ జే ♦ పరమధర్మ
మనృతమున హేయమనియెద ♦ రఖిలజనుల
కందు నృపతులబద్ధము ♦ లాడుచుండ
ఘోరనరకముల్ వారికి ♦ దూరమగునె?

ఆ॥ రాజు నీతి యెఱిఁగి ♦ పూజనీయుఁడయి
రమ్యగుణయశో వి ♦ రాజితుఁడయి
ధర్మబుద్ధిఁగలిఁగి ♦ ధర నేలఁజెల్లును
గాని తగునె ప్రజలఁ ♦ గష్టపెట్ట.

తే॥ పొదుగుఁగోయ గోక్షీరముఁ ♦ బిదుకవశమె?
ప్రజలు సామంతులందఱు ♦ బహువిధములఁ
గష్టపడుచుండ ప్రభువున ♦ కిష్టమయ్యె
నేటి కలికాలమున నిట్టి ♦ చేటువచ్చె.

తే॥ మోసమున మున్ను చేబ్రోలు ♦ పురమునందు
వడ్లపూడిని కొల్లూరు ♦ పట్టణమున
రైతులంబట్టి బంధించి ♦ రచ్చకీడ్చి
హెచ్చుసుంకంబునాసించి ♦ యిడుములిడవె?.

క॥ చెంచులను జేరి తంత్రిని
వంచించి బురంబులడవి ♦ బాటలఁ బలుదో
యించిన దొంగల దారనీ
కించుకఁగరుణారసంబు ♦ నేర్పడునొకో. 185

క॥ నూరుగుడు చెంచుపేరుల
మారణ మొనరించినట్టి ♦ క్ష్మాపతివాటిన్
దారుణపు కోర్కెఁ గోరితి
సారాసార సువిచార ♦ సంపద లేమిః

తే. ధాత్రిపతివయ్యు మేరకుఁ ♦ దప్పినావు
ముందువాగ్దానముంగొని ♦ మోసపుచ్చి
నాఁడవి యసురంతయుఁ ♦ గూడివచ్చుఁ
గాకనీకేని సుంకముం ♦ గట్టినపుడు.

తే॥ నేరమంతయు తనదను ♦ నిశ్చయమున
గప్పమంతయుఁ జెల్లించు ♦ కారణమున
నఖిలసామంత పాలకుఁ ♦ డాడుచున్న
మాఱువల్కఁడా భూపతి ♦ వీరుఁడయ్యు.

వ॥ అప్పుడామాత్య శిరోమణియగు నయ్యన్నగారు నట్టి వచనంబులాడుట కెంతయుం జింతించి ప్రభునియట్లు దిరస్కరించి వల్కంజనఁ బాడియేయన సంగన్నగారిట్లనియె.

తే॥ ప్రభునిముంజేయి వియ్యంబుఁ ♦ బడయనెంచఁ
బోదునాదగు మోచేయి ♦ నాదరించి
వెఱచువాఁడనె నేనెంత ♦ వెఱ్ఱినైన
ధర్మమార్గంబుఁదప్పింప ♦ ధరణిపతికి. 190

వ॥ అనిపల్కిన నమ్మంత్రి పుంగవుండును సంగన్నగారి నను నయింపనెంచి సరసమాధుర్య వచనంబులఁ జనపతికిఁగల ధనావసరంబును, నాతండు సేయు ధర్మకార్యంబుల తెఱంగును దెల్పుచు నమ్మహీపతి ప్రభావంబిట్లనిపల్కె.

సీ॥ భూసురాదులకెల్ల ♦ భూరిదానాగ్రహా
రంబుల నిచ్చిన ♦ రాజవరుఁడు
ధీరుఁడై ఘనతులా ♦ భారంబు మున్మూఁరు
కాంచనంబునఁదూఁగి ♦ పంచెనితఁడు
గోపురప్రాకార ♦ కుడ్యంబులను మంగ
ళాద్రి నృసింహున ♦ కమితభక్తిఁ
గట్టించి చంద్రశే ♦ ఖరునకుఁ బ్రీతిగా
లింగప్రతిష్ఠఁజే ♦ యంగ నెగడె
తే॥ నట్టియౌదార్య సాహసు ♦ నమితతేజు
దైవభక్తిపరాయణు ♦ ధరణిపతిని
సద్గుణాకరు ననఘుని ♦ సచ్చరిత్రు
నిందసేయఁగఁదొడఁగితే ♦ మందమతిని.

వ॥ ఇట్లని యయ్యన్నగారు పల్కిన నక్షేపంబు నివారించె నంత నప్పృథ్వీపతియు నమరావతికిఁ బయనంబై పోయె. నింక సంగన్నగారి కథ యెట్లనిన నతండును గొంతగాలంబు నకు కుమారుళ్ళ వివాహ ప్రయత్నంబుఁజేసి పులివతిక నమితియందు బలపరాక్రమ వంతులై యశోధనులై విల సిల్లుచున్న కమ్మదొరల బాంధవ్యంబులు నిశ్చయించి.

సీ॥ కోనేరు వెంకయా ♦ ఖ్యుని పుత్రికామణి
శాయమ్మ నరసయ ♦ చౌదరికిని
కొల్లినాయుండమ్మ ♦ గూర్మిసుతశ్రేష్ఠ
రంగమ్మ భావయ ♦ ప్రముఖునకును

ముమ్మలనేన్వంశ ♦ మూతిఁ నర్సయ కూతు
రాజమ్మ సీతయు ♦ ప్రభువరునకు
మైనేడు వారిలో ♦ మహితసుందరరాశి
వెంకమ్మ లింగయ ♦ వీరవరుని

తే॥ కొసఁగి పరిణయమ్ములను దా ♦ నెసఁగఁజేసె
నమితవైభవములతోడ ♦ నప్పుడచటి
పౌరులానంద భరితులై ♦ బహువిధములఁ
బ్రస్తుతింప నావియ్యాల ♦ వారిఁగాంచి.

వ॥ ఈప్రకారమ్ముగ సంగన్నగారు కుమాళ్ల వివాహమహోత్సవంబు లత్యంతవైభవంబుగఁ జేయించిన కొంత కాలంబునకు. 195

—♦ సంగన్నగారి కుమాళ్ల వంశానుక్రమము ♦—

తే॥ నరసయాహ్వయునకు సుతుల్ ♦ 'నాస్తి' యగుట
దత్తపుత్రుగఁ గొనెఁదన ♦ తమ్ముఁడైన
లింగయాఖ్యుని కొమరున ♦ భంగవరుని
మూళయాహ్వయు మిక్కిలి ♦ మోదముునను.

వ॥ ఈతండును కోనేరు బసవయ్యగారి కుమార్తె రాజమ్మను పరిణయమయ్యె నంత.

తే॥ భావయాహ్వయునకు పుత్ర ♦ పంచకంబు
గల్గెకొదార్య సద్గుణ ♦ ఖనులు ఘనులు
సీతయాఖ్యుండు బుచ్చయ ♦ శీలవరులు

జగ్గయాఖ్యుండు వితరణ ♦ శాలిసంగ
యాఖ్యుఁడును బట్టయాఖ్యుఁడు ♦ నమలయశులు.

వ॥ సీతన్నగారికి కుమాళ్ళు లేక యిందు జగ్గయ్యను దత్త పుత్రుగ స్వీకరించె.

ఆ॥ రిపుచమూవిదారి ♦ లింగయాహ్వయునకుఁ
బుట్టిరనుఁగు సుతులు ♦ మూళయాఖ్య
సంగయాఖ్యులనెడి ♦ సద్గుణశీలురు
మూళయయును దత్త ♦ పుత్రుఁడయ్యె. 200

వ॥ ఇట్లు సంగన్నగారు పుత్రపౌత్రులంగాంచి సర్వసౌఖ్యంబుల ననుభవించు చున్నంత.

క॥ శృతిశాస్త్రార్థ వివేకా!
శ్రితపోషక! రామచంద్ర ♦ సేవక! ధరణీ
స్థితకౌత్తవంశదీపక!
కృతినాయక! పుణ్యతీర్థ ♦ వీక్షక! జనకా!

మాలిని॥ ధరణిజహృదయేశ ♦ ధ్యానచింతానిమగ్నా!
నిరుపమ గుణహారా! ♦ నీరదభ్రాజదేహా!
సరసవచన భూషా! ♦ సత్యవాక్యార్థపాలా!
మరపురసమ శ్రీచా ♦ మర్లపట్నాధివాసా!

గ ద్య

ఇది శ్రీపరమేశ్వర కరుణాకటాక్ష వీక్షణ ప్రసాదిత కావ్య రచనా కౌశల, కౌత్తవంశసుధాకర శివలింగయాఖ్య పుత్ర, భావయాఖ్య విరచిత శ్రీ సంగభూపాలీ యాంతర్గత ద్వితీయాశ్వాసము,
సం పూ ర్ణ ము.



శ్రీ ర స్తు.

# సంగభూపాలీయము

## తృతీయాశ్వాసము.

—:0:—

క॥ మనసిజహాసిత శుభాంగా!
ఘనహాళికదుర్గశృంగ! ♦ కరుణాపాంగా!
వినయాంతరంగ! రాజమ
వనితాహృదయాబ్జభృంగ! ♦ వరశివలింగా!

—: మరాటిసైన్యము గ్రామముపైకి దండెత్తుట. :—

వ॥ అవధరింపుమట్లు సంగన్నగారు పుత్రపౌత్ర సమూహంబులతో నొప్పారుచు సకల సౌఖ్యంబు లనుభవించుచున్నంత రాజ్యమున మరాటీ గుంపులచే దోపిడియారంభమయ్యె. ప్రతిగ్రామమును, పట్టణమును వారలచేఁ జిక్కువడుచుండె. ధన ధాన్యంబులుగన్యలు నొందఁటో వారికి బలియగుచుండి రట్లు వారి దారుణ కార్యంబులు ఘోరంబయ్యె నప్పుడు.

సీ॥ ఏవాడఁగన్గొన్న ♦ నిందీవరాక్షులఁ
బలిమిఁగైకొనిరంచుఁ ♦ బలుకువారు
నేపురింగాంచిన ♦ దోపిళ్ళకతమున
ధనరాశిహరియించి ♦ రనెడివారు

నేపట్టణముఁజూడ ♦ నెల్లవ్యాపారముల్
దీనమానితినుంచుఁ ♦ దెలుపువారు
నేపల్లెకూటంబు ♦ నీక్షింప సంపదల్
గోల్పోయి మిక్కిలి ♦ కుందువారు

తే॥ నైజనంబిట్టులార్తులై ♦ యభయమిచ్చు
రాజవర్యుఁడు లేమి మ ♦ రాటివారి
క్రూరకార్యంబులకుఁ బ్రతీ ♦ కారమేమి
సలుపకుండిరి దైవంబు ♦ చాలఁడనుచు

వ॥ అట్టిసమయంబున నా మరాటిగుంపు చామర్లపురంబును గూడ కొల్లగొట్టుటకై వచ్చుచున్న జాడనెఱింగి సంగన్న గారును మున్ముందుగనే మేల్కొని పురంబునకు చుట్టు నభేద్యంబుగ నుండునటులఁ బౌరసేనల కాపుండ నేర్పఱచి శత్రువులరాక కసాధ్యంబుగ నొనర్చె. అద్దండును గ్రామంబుచేరువకు వచ్చుజాడలనెఱింగి మున్ముందంతఃపురస్త్రీలను పురస్త్రీలనందఱి నొకయుత్తమమార్గంబున వేఱొక్క సురక్షిత స్థలంబునకుబంపె నంత నిక్కడ నొకయుద్ధభేరిగట్టించి వాయింపఁజేసిన నది వినిన మరాటీసైన్యంబిది యేమై యుండనోపునని వితర్కించుచున్న సమయమ్మున నాజాడఁ గాంచిన సంగన్నగారి గూఢచారులా మరాటీనాథునితో నిట్లనిరి.

తే॥ ధరణి సంగన్నగారను ♦ దర్పశాలి
పాలనముక్రింద నున్నదీ ♦ పట్టణంబు

నఁదు రణభేరి మ్రోగెడు ♦ నయ్యా! మిమ్ము
బ్రతుకనియ్యరప్పారిఁగల ♦ రాచవారు. 5

వ॥ అనిన సంగన్నగారి సైన్యం బెంతయని మరాటీనాథుఁ డడిగిన నది మీ సైన్యంబునకు రెండింతలుండు ననిన నాతండును మనంబున భయంబునొంది దోఁచుకొనుటకనేక పురంబు లుండ దీనినిందాఁక నేల యని తలంచి మఱొక్కెడ దెస కేఁగె. తదుపరి నంతఃపురస్త్రీల పురస్త్రీల నిజవాసంబులఁ జేర్పించి సంగభూపాలుండును సుఖంబుండె మఱియు.

తే॥ నిర్మలజ్ఞానశీలు ష ♦ ట్కర్మనిరతు
భారతుల విశ్వనాథు వి ♦ ప్రకులవర్యు
గూర్చి రప్పించి యతఁడు సే ♦ కూరునుండి
తనపురోహితునిగ జేసు ♦ కొనియె నంత.

సీ॥ చూచుజనములు మిక్కిలి ♦ చోద్యపడఁగ
రమ్యగృహ మొండు తనదు పు ♦ రంబునందు
సంగయాఖ్యము నిర్మించి ♦ సాహసమున
నా పురోహితునకొసంగె ♦ నాదరమున.

తే॥ సంగభూవరుఁ డీరీతి ♦ సర్వజనుల
కమితసాయంబుఁ జేయుచు ♦ ఖ్యాతినొంది
తన యిజారాపురంబులఁ ♦ దప్పమొప్పఁ
బౌరపాలనఁ జేయ రా ♦ చూరుప్రభుఁడు.

క॥ తనగ్రామంబుల నన్నిఁటిఁ
గనుటకు నపుడపుడువచ్చి ♦ గ్రామములందున్

ఘనుఁడగు సంగయ యాశయమును
విని మిక్కిలి సంతసించి ♦ వెడలుచునుండెన్.

రాచూరుప్రభుండు సంగన్నగారికి మాన్యములొసంగుట :_

క॥ నానాటికి సంగాఖ్యుఁడు
మానితుఁడయి తనకొసంగు ♦ మన్ననలకులో
లోనముదమంది యొకతరి
భూనాయకుఁడిట్లుబల్కె ♦ మోదమెలర్పన్.

తే॥ అప్ప! నాగ్రామములగుత్త ♦ నంది నీవు
నేర్పుతో కార్యములొనర్చి ♦ నెగడినావు
నాకు సౌఖ్య బు కీర్తియు ♦ నీకతమున
నబ్బె సరి రాజులందున ♦ ననఘవర్య.

వ॥ ఇదిఁగాక నీవు మాకొనర్చిన సాయంబులకును సరఫరాలకును మేము మిక్కిలి ఋణపడియున్నాము. ఆముబాదలా దీరినగాని మాయాత్మకు తృప్తిలేకున్నయది. మఱియు మరాటీగుంపులు మీపురంబును ప్రవేశించకుండ మీరు జేసిన యేర్పాటులన్నియు వినినమాడెందం బమందానందం బయ్యెడిని. కావున మాభూములలో, గొన్నిఁటిని మీకు మాన్యములుగా నిచ్చెదనని పలికిన సంగన్నగారు " మీరిచ్చుభటవృత్తి మాన్యములు మాకుసమ్మతములుగావు. అయ్యవి గౌరవప్రదములు గావని" న నంత నప్ప్రభుండును, భటవృత్తిమాన్యములు మీకు గౌరవదాయకము గానిచో ముబాదలామాన్యములుగా నిచ్చెదమని పల్కి మఱియు నిట్లనియె.

కం॥ నీవంటిదొరలమన్ననఁ
గావింపని నాఁడు లేఁడు ♦ కలుషాత్మకుఁడౌ
గావున జేసెదనంచును
వేవిధములఁబొగడి పుడమి ♦ విభుఁడప్పట్లన్.

తే॥ చామరల్ పురిలోనున్న ♦ సావరములు
రెండు కుచ్చెళ్లభూమి నా ♦ లేఁడొసంగ
గౌరవోపేతముగను సం ♦ గనయుదానిఁ
జేకొనియె భూవరేణ్యుని ♦ చిత్తమెఱిఁగి. 15

వ॥ ఈరీతి నారాచూరు ప్రభుండగు జంగన్నరాయలవారు సంగన్నగారి స్వకుటుంబమునకైగౌరవార్థముగమాన్యము లొసంగి చనియె నంత.

—♦ రంగావధూత సంగన్నగారింజూడ వచ్చుట ♦—

సీ॥ గుదిమెండ్లవంశాబ్ధి ♦ కువలయేశుండన
వసుధాస్థలంబున ♦ వరలెనెవఁడు
పరమతపోనిష్ఠ ♦ భరితుభారద్వాజ
మునిగోత్రజుండయి ♦ తనరెనెవఁడు
కౌత్రవంశాభోజ ♦ కువలయార్కుండన
నెయ్యుఁడై మతగురుం ♦ డయ్యెనెవఁడు
వైరాగ్యదృష్టిచే ♦ వర్జించి పూర్వాశ్ర
మంబవధూతగా ♦ మనియెనెవఁడు
తే॥ ముక్తికాంతామనోహరా ♦ సక్తిచేత
భక్తియోగశీలుండయి ♦ పరమపురుషు

బుండరీకాక్షుసంసిద్ధిఁ ♦ బొందె నెవ్వఁ
డట్టి రంగావధూతగా ♦ రతనికడకు.

తే॥ శిష్యబృందము లొకప్రక్కఁ ♦ జేరి కొలువ
నరుగుదెంచిన మిక్కిలి ♦ హర్షముప్ప
నర్ఘ్యపాద్యాదిపూజల ♦ నాచరించి
చిత్తమిగు రొత్తఁ బరిచర్యఁ ♦ జేసె నతఁడు.

వ॥ అట్లు బహువిధసమ్మానము లొనర్చి సంగన్నగారును గురువర్యునిం జేరి నానావిధంబుల స్తుతింజేసిన బ్రసన్నుండై యాతని భక్తిచే నిట్లని ప్రశ్నించె.

ఆ॥ అఖిలజనము ముక్తి ♦ నభిలషించును గాని
తమకఁ బడుదు రెట్టి ♦ దారి గనక
నెల్ల జీవ కోటి ♦ కీముక్తి సాధన
మగు నుపాయ మెద్ది ♦ దగ వచింపు. 20

వ॥ అనిన నాతనికి రంగావధూత యిట్లనియె.

తే॥ మెచ్చఁదగు ప్రశ్న యడిగితి ♦ సచ్చరిత్ర
యే నెఱింగిన వరకట ♦ నెఱుకపఱతు
గాని సంపూర్ణవిజ్ఞాన ♦ కలితులైన
పరమ మునిపుంగవులె దీనిఁ ♦ బలుకవలయు.

తే॥ తీర్థయాత్రలఁ జేయఁగా ♦ దిరుఁగుగాక
యశ్వమేధాది క్రతువుల ♦ నాచరించి
దానధర్మంబు లెన్నియో ♦ తనివిదీర
సల్పుదురు గాక భక్తికి ♦ సాటి గాదు.

యెల్ల జీవులు సమమను ♦ హితముఁదలఁచి
భూతదయఁగల్గి మనుజుండు ♦ పొందు ముక్తి.

వ॥ ఇదియునుంగాక,

తే॥ వేదశాస్త్రంబులాదిగా ♦ విద్యలన్ని
విశ్వకళ్యాణమునకునై ♦ యీశ్వరుండు
కల్పనము సేయుటెఱిఁగి య ♦ క్రమమునైన
స్త్రీపురుషభేద మెంచక ♦ తెలియవలయు.

వ॥ మఱియు నొక్కటి వినుము.

తే॥ కులవిచక్షణతో నేమి ♦ గుణములున్న
జాతిభేదంబులెందుకు ♦ నీతియున్న
కాననంబేమి పురమేమి ♦ జ్ఞానమున్న
మాననీయులై చరియింతు ♦ మానవులకు.

వ॥ ఇట్లని పల్కిన సంతోషస్వాంతుండై యమ్మధుర వచనంబు
లాలకించుచు సంగన్నగారును దుష్టులకెట్టి గతులు గల్గు
చుండునసిన నవధూత యిట్లనియె. 35

తే॥ నాస్తికుఁడు, చోరుఁడుంగుల ♦ నాశకుండు
పరులబీడించు వాఁడును ♦ బరులకలిమిఁ
గని యసూయా పరుండయి ♦ మనెడివాఁడు
కుత్సితుండును నరకానఁ ♦ గూలుచుంద్రు.

తే॥ మూర్ఖుఁడౌ కోపి చవిఁజూడఁ ♦ బోదునీతి
వాక్సుధారసమద్దాని ♦ వహ్నిపగిదిఁ

తే॥ సచ్చిదానంద రూపుని ♦ సతము భక్తిఁ
గొలుచుచుండిన వారికిఁ ♦ గలుఁగుచుండు
మోక్షమార్గంబు నిరతంబు ♦ పుణ్యపురుషు
లందుచే భక్తి నీశుని ♦ జెందుచుండ్రు.

ఆ॥ స్థానబలముగాని ♦ తనబల్మిగాదను
వేమవర్య పలుకు ♦ విధముఁబోలు
కఠినశిలను వృక్ష ♦ ఖండంబు లందైన
నుండు దేవుఁడతని ♦ యండ మనకు. 25

తే॥ కనులకుం గానరాడను ♦ కారణమున
నెటులఁ బూజింతుమా యంచు ♦ నెంచరాదు
సందియము లేక యెల్లెడ ♦ సంచరించి
భక్తులకు నీప్సితంబులఁ ♦ బంచియిచ్చు.

వ॥ అనిన బ్రపంచము దున్నంత కాలము బురుషునకు విధ్యుక్త
ధర్మము లెట్టివనిన నాతండిట్లనియె.

తే॥ పరులకుపకృతి సలుపుట ♦ పాపకార్య
ములు విసర్జించి న్యాయైక ♦ బుద్ధిఁగలిఁగి
ధనము నార్జించుటయు నిల ♦ దానధర్మ
ములు నొనర్చుట విధియగుఁ ♦ బూరుషునకు.

వ॥ కాని యివియన్నియు నీశ్వరార్పితబుద్ధిచే జేయంగవలయు
మఱియు నొక్క రహస్యంబు గలదు. దానిని సావధాన
చిత్తుండవై వినుము.

తే॥ విశ్వమానవసౌభ్రాత్ర ♦ విధముఁదెలిసి
భక్తినను రాగప్రేమముల్ ♦ బాదుకొలిపి

యెల్ల జీవులు సమమను ♦ హితముఁదలఁచి
భూతదయఁగల్గి మనుజుండు ♦ పొందు ముక్తి.

వ॥ ఇదియునుంగాక,

తే॥ వేదశాస్త్రంబులాదిగా ♦ విద్యలన్ని
విశ్వకళ్యాణమునకునై ♦ యీశ్వరుండు
కల్పనము సేయుటెఱిఁగి య ♦ క్రమమునైన
స్త్రీపురుషభేద మెంచక ♦ తెలియవలయు.

వ॥ మఱియు నొక్కటి వినుము.

తే॥ కులవిచక్షణతో నేమి ♦ గుణములున్న
జాతిభేదంబులెందుకు ♦ నీతియున్న
కాననంబేమి పురమేమి ♦ జ్ఞానమున్న
మాననీయులై చరియించు ♦ మానవులకు.

వ॥ ఇట్లని పల్కిన సంతోషస్వాంతుండై యమ్మధుర వచనంబు
లాలించుచు సంగన్నగారును దుష్టులకెట్టి గతులు గల్గు
చుండుననిన నవధూత యిట్లనియె. 35

తే॥ నాస్తికుఁడు, చోరుఁడుంగుల ♦ నాపకుండు
పరులబీడించు వాఁడును ♦ బరులకలిమిఁ
గని యసూయా పరుండయి ♦ మనెడివాఁడు
కుత్సితుండును నరకానఁ ♦ గూలుచుంద్రు.

తే॥ మూర్ఖుఁడొ కోపి చవిఁజూడఁ ♦ బోదునీతి
వాక్సుధారసమద్దాని ♦ వహ్నిపగిదిఁ

గాంచుచుండును ప్రాజ్ఞుండు ♦ మించుఁగోర్కెఁ
దవిలి యానందమొందెడు ♦ ధాత్రియందు.

తే॥ భక్ష్యభోజ్యములిడఁ వ్యాధి ♦ బాధితునకు
నుపశమించునె యారోగ ♦ మెపుడుగాని
దుష్టులకునీతిఁ దెలిపిన ♦ శిష్టజనులఁ
గ్రోధమునబట్టి హింసింత్రు ♦ కూర్మిలేక.

ఆ॥ విషముఁ గ్రోలి పిదప ♦ వెతనొందు నాతని
పగిది మూర్ఖజనుఁడు ♦ పాపకార్య
ములనొనర్చి వాని ♦ ఫలములఁ గుడువఁగా
యమపురంబుఁ జేరి ♦ యనుభవించు.

వ॥ ఇట్లు వల్కుచు నయ్యవధూత సంగన్నగారిం జూచి యోగ్యుండవగు నీకుభక్తివలననే ముక్తిమార్గంబు గల్గెడు నీకొక్కదివ్య మంత్రం బుపదేశించెద నిందులకై యేనిపు డరుదెంచితినని పల్కిన నాతండిట్లనియె. 40

-:రంగావధూత సంగభూపాలునకు మంత్రోపదేశమొనర్చుట:-

క॥ గురువర్యులగుట మీఁచేఁ
గురుమంత్రముఁ గొనుటమేలు ♦ గూడెదునైనన్
గురుతరమగు సందేహము
గుదుతించితి దానిఁదీర్పు ♦ కోవిదవర్యా.

తే॥ సంగమస్థలవాసుఁడౌ ♦ సంగమేశు
వినుతిచే లగ్నమయ్యెనా ♦ మనముమున్నె

దేవతలకెల్ల దేవుఁడా ♦ దేవదేవుఁ
దక్కపరదేవతలఁ గొల్చు ♦ తలఁపులేదు.

క॥ నారాయణ మంత్రాద్భుత
పారాయణులైన యట్టి ♦ ప్రథిత యశస్కుల్
మీరుపదేశ క్రమమిఁక
నేరీతి నొనర్తురంచు ♦ నెంచెద నెదలో.

వ॥ అంత రంగావధూత యిట్లనియె.

తే॥ పుండరీకాక్షు సంసిద్ధిఁ ♦ బొందుకతన
శైవవైష్ణవ భేదంబు ♦ సమసెనాకు
నందుచే నవధూతనై ♦ యలరినాఁడఁ
గాన నీశంకలన్నియు ♦ మానుమయ్య. 45

వ॥ ఇదియునుంగాక.

తే॥ శిష్యుఁడేమాడ్కిఁ జిత్తంబుఁ ♦ జేర్చుచుండుఁ
దానిగనిపెట్టి యొజ్జయా ♦ దారినడపి
గమ్యపదమును జేర్చుట ♦ ఘనతగాని
వేఱుత్రోవలఁ జూపుట ♦ వెఱ్ఱిగాదె?.

వ॥ ఇట్లనిపల్కిన సంగన్నగారికి శంకానివృత్తియయ్యె నంత గురుండును మహామంత్రోపదేశముం జేయఁగోరి యాతనితోఁ బ్రతిదినంబున శుచివై యద్దానిని భక్తితో జపించుచుండుమని పల్కి యంత.

సీ॥ భవభయసంసార♦బంధనమ్ములఁ ద్రోచి
రక్షించు నేమంత్ర ♦ రాజమహిమ

దారిద్ర్యదుఃఖ సం ♦ తతుల నిర్మూలించి
రక్షించు నేమంత్ర ♦ రాజమహిమ
పాపంబు లాపదల్ ♦ బహురోగములఁబాపి
రక్షించు నేమంత్ర ♦ రాజమహిమ
ధర్మార్థకామ ని ♦ త్యసుఖాదుల నొసంగి
రక్షించు నేమంత్ర ♦ రాజమహిమ

తే॥ ఇన్నియేల? జపించిన ♦ నీప్సితములఁ
బ్రాణులకుఁగూర్చు నేమంత్ర ♦ రాజమహిమ
యట్టిపంచాక్షరీమంత్ర ♦ మధికనిష్ఠ
దేశికుండాతనికి నుప ♦ దేశమిచ్చె.

వ॥ ఇట్లాయవధూత ప్రణవసహితంబుగా పంచాక్షరీ మహా మంత్రం బుపదేశించి వెడలిపోయిన సంగన్నగారును గురూపదేశానుసారంబున. 50

క॥ పంచాక్షరి మంత్రంబు స
మంచితభక్తిజపియించ ♦ నాతండంతః
గాంచెను బ్రహ్మానందము
పంచాస్త్రుని వైరిమహిమఁ ♦ బల్కఁగ వశమే?.

వ॥ ఇట్లు సంగన్నగారు సచ్చిదానందమయుండైన యీశ్వరుం గొల్చుచు నచట వసించుచు చుట్టుపట్ల గ్రామంబుల కన్నిఁటికిఁ బెద్దయై, ప్రభువుల,జమీందారుల సామంతుఁడై కీర్తిశాలియై యొప్పుచున్నంత నొక్కనాఁడు.

— రాచూరు ప్రభుండు చానుర్లపురికి వచ్చుట —

క॥ భంగదరివీరుఁడుం బ్రభు
పుంగవుఁడర్థిజనకల్ప ♦ భూజమునగునా
జంగన్నరాయభూపతి
సంగాహ్వయుఁజూడవచ్చె ♦ సంభ్రమ మొప్పన్.

క॥ మాణిక్యరావువంశో
ర్వీనాథునిఁ గీర్తిశాలి ♦ వితరణఖని వి
ద్యానిధివచ్చుటఁగని స
న్మానములొనరించె నతఁడు ♦ మానితబుద్ధిన్.

తే॥ ఆమహీపాలుఁడంతట ♦ నప్పురంబు
నెల్లదిక్కులు వీక్షించి ♦ యింపుగుల్కు
సంగమస్థలముం జేరి ♦ సంగమేశు
భక్తితోఁ బూజలం జేసి ♦ పరమనిష్ఠ. 55

తే॥ కూడలి క్షేత్రమున గనుఁ ♦ గొన్న తుంగ
భద్ర కృష్ణాస్రవంతీ ప్ర ♦ వాహములను
దివ్య వట భూజములమేటి ♦ దేవళముల
మంటపంబుల నాక్షేత్ర ♦ మహిమ నరసి.

తే॥ అమ్మహాదేవునకును ని ♦ త్యమ్ముజరుగు
పూజలంగాంచి ముదితుఁడై ♦ భూసురాళి
స్వస్తివిని పృచ్ఛఁజేసెను ♦ సంగయాఖ్య
నెవ్వరేర్పాటుఁగావించి ♦ రిట్టులంచు.

వ॥ అని పల్కి మఱియు,

క॥ ఈదేవళంబుఁగాంచి ప్ర
మోదితమానసుఁడనైతి ♦ ముందుగఁ దెల్పెం
డీదేవతార్చనకునై
యేదాతయొనర్చె నిట్టి ♦ యేర్పాటులనన్.

వ॥ అంత సంగన్నగారమ్మహీపాలున కిట్లనియె. 60

ఉ॥ విత్తముబట్టివైభవము ♦ వెల్వడఁజేయఁగవచ్చునంచు నా
చిత్తమునందలంచి యతి ♦ శీఘ్రముగామునునేను మీకడన్
గుత్తకుఁగొన్న గ్రామమున ♦ గొద్దిగభూముల వేఱువేఱుగా
నెత్తియు సంగమేశ్వరుని ♦ కింపగునుత్సవ వైభవంబులన్
బత్తిమెయిన్నొనర్పుటకుఁ ♦ బంచితివానిని బ్రాహ్మణాళికిన్
హత్తిననృత్యవాద్యముల ♦ హర్నిశముంబొనరించువారికిన్.

క॥ మీదయచే నివియన్నియు
సాదరమతిఁజేసినాఁడ ♦ సతతంబీశున్
భూదేవాదిజనంబులు
పేదలుసాధుచయమెల్లఁ ♦ బేర్మిఁభజింపన్.

క॥ ఏనింతఁజేసినాఁడను
భూనాయక నాదుపూర్వ ♦ పుణ్యవశమునన్
క్ష్మానాథు కరుణగల్గుట,
లేనియెడ నొనర్పఁగలనె ♦ లేశంబైనన్.

వ॥ మఱియు,

క॥ ఏనిచ్చిన మాన్యంబులు
మానవపతి కరుణలేక ♦ మహిశాశ్వతమై

జానొందఁగలవె? కావున
వానికి స్థిరముగ నొనర్ప ♦ వలయును మీరల్. 65

వ॥ ఇట్లు పల్కిన సంగన్నచౌదరి మాటల కాశ్చర్యసంతో
షంబులు పెనగొన ప్రభుండిట్లనియె.

ఉ॥ సచ్చరితుండవంచుజన ♦ సంఘముబల్కుచునుండవింటినే
మెచ్చితినీయుదారతకు ♦ మేటిగుణాఢ్యుఁడవీవునీకునా
యిచ్చకొలందినిచ్చెదను♦హెచ్చగుమాన్యములంచుఁబల్కుచున్
జెచ్చెరవ్రాసిముద్రనిడఁ ♦ జేసియొసంగుచు ప్రేమతోడుతన్.

తే॥ నీయుదారత నీభక్తి ♦ నీదుశక్తిఁ
గాంచి యత్యధికానంద ♦ గరిమమించి
నాఁడ నిట్టి సామంతులు ♦ న్నారటన్న
నాదురాజ్యంబు భాగ్యంబ ♦ నంగదగదె?.

తే॥ అప్ప! శ్రీసంగమేశ్వరు ♦ నాలయంబు
ముందు నీచేతనభివృద్ధిఁ ♦ బొందుగాతఁ
దానికిం గావలయు భూమి ♦ నేనొసఁగితి
ననిన సంగన్న చౌదరి ♦ హర్షమొందె.

వ॥ ఇట్లా ప్రభుండా దేవాలయోద్ధరణ భారమంతయు సంగన్న
గారి పరంబుజేసి స్వస్థానంబున కేగె తదనంతరంబ. 70

## —♦ సంగన్నగారి ద్వితీయ సుతుండగు భావయ్యగారు కుమార్తెలం గాంచుట ♦—

సీ॥ భావయాహ్వయునకుఁ ♦ బరమపవిత్రలౌ
పుత్రికారత్నముల్ ♦ బుట్టిరిద్దఱ

రతిసుకుమారలు ♦ రతిసుందరాకార
లంబుజాక్షులును హి ♦ మాంశుముఖులు
కలకంఠకంఠులు ♦ కలహంసయానలు
విద్యావతులు మహా ♦ వినయమతులు
అప్పమాంబన రత్న ♦ మాంబన బేరొంది
విదిత యశస్కలై ♦ వెలయువారు

తే॥ వారిలో నప్పమాంబ జం ♦ పాలవంశ
సోము శ్రీరాము సద్గుణ ♦ ధాము వెంక
టాద్రిభూపతి సచివుఁడౌ ♦ యయ్యనాఖ్యు
ననుఁగు కొమరుని బెండిలి ♦ యాడెనధిప.

ఉ॥ ముమ్మలనేని వంశముఁగ♦ముఖ్యుఁడు వెంకయనాముపాలిభా
గ్యమ్మనరత్నమాంబయుద♦యంబయెనంచుజనుల్ వచింపఁగా
నమ్మహనీయరూపు, సుగు ♦ ణాకరరత్నము, దావరించె ప్రే
మమ్మునతల్లిదండ్రులును♦మాన్యుఁడుదాతయుఁబెండ్లిసేయఁగా

వ॥ ఇట్లు సంగన్నగారు తనపునుమరాంద్ర వివాహంబు లత్యంత వైభవంబుగ బరిపూర్తిచేయించె నంత గొంతకాలంబున కాతండు తన పాలనమంతయుఁ గుమాళ్ళవరంబొనర్చి నిరంతర దైవచింతనకుం గడంగి.

—♦ కంద, గీత, గర్భచంపకమాలావృత్తము. ♦—

చ॥ స్మరహర! ధూర్జటీ! గిరిశ ♦ శంకరనిచ్చలు నిన్నుఁగొల్తుఁగ్గా
వరకరుణాసుదృ దలఁచి♦ పావనమాపదదాస్యమిమ్మయో

ఖర!పురనాశకా!వసుధఁ♦గాంచరుమూఢులుఁ బాపులెప్డుశా
ర్వరధరునిన్ హరున్ సుజన♦వత్సలునవ్యయుస్తోత్రపాతు,నిన్.

గర్భకందము॥ హర! ధూర్జటీ! గిరిశ! శం
కర నిచ్చలుఁ నిన్ను గొల్తుఁ ♦ గావరకరుణన్
బురనాశకా! వసుధఁగాం
చరు మూఢులుఁ బాపులెప్డు ♦ శార్వరధరు,నిన్.

గర్భగీతము॥ గిరిశ! శంకర! నిచ్చలుఁ ♦ గీర్తిసేతుఁ 75
దలఁచిపావనమా పద ♦ దాస్యమిమ్ము
వసుధఁ గాంచరు మూఢులుఁ ♦ బాపులెప్డు
సుజనవత్సలు నవ్యయు ♦ స్తోత్రపాతు.

సంగన్నచౌదరి పుత్రపౌత్ర సమూహంబులకు నీతులఁగఱపుట.

క॥ ఈరీతి దేవదేవున
పారమ్యగుభక్తి పార ♦ వశ్యముచేతన్
గోరిభజించుచు నాతఁడు
వైరాగ్యస్ఫూర్తినొందె ♦ వ్యవహారములన్.

తే॥ ఇంతలో మృత్యుదేవత ♦ యితనికీర్తిఁ
గాంచి యోర్వక కబళింపఁ ♦ గాఁదలంచె
నప్పుడవసాన కాలమా ♦ హాత్మ్యమెఱిఁగి
బంధుమిత్రాదులను బిలు ♦ వంగఁబంచె.

వ॥ ఇట్లుసంగన్నగారు తనపుత్ర పౌత్ర సమూహంబును, సోదర
పుత్ర పౌత్రులను, దక్కంగల బంధుమిత్రాదుల నందఱం
బిలిపించి వేర్వేర నాదరించిన వారును దమకు లోకమునం

గల ధర్మాధర్మంబుల నన్నింటి నుపదేశింప వలయునని ప్రార్థించి యడిగిన నాతండునుతన నేర్చిన ధర్మములనన్నింటి న్నుత్సాహశం దెచ్చుకొని యిట్లని చెప్పందొడంగె.

తే॥ తల్లిసత్యంబు, జ్ఞానంబు ♦ తండ్రి, సోద
రుండు ధర్మము, దయయె మి ♦ త్రుండు, శాంతి
భార్య, యోరిమికొడుకు, ప్ర ♦ పంచమందు
వీరలార్వురు నాబంధు ♦ వితతినిజము. 80

క॥ మానంబిదు సద్యశము
ప్రాణంబస్థిరము గాన ♦ ప్రతిమనుజుండున్
మానాభి రక్షణమునకుఁ
బ్రాణంబులనేని యొసఁగఁ ♦ బాల్పడవలయున్.

క॥ పరసతిఁ దన తల్లి వలెం
బరుల ధనంబులను విషము ♦ పగిదిని మఱియున్
బరులను దనకై వడిఁ గను
పురుషుండే పండితోత్త ♦ ముండన బరగున్.

తే॥ అశ్వరంబులు దేహంబు ♦ లస్థిరములు
సంపదలు, మృత్యు వెప్పుడు ♦ సన్నిహితము
గానమనుజుండు ధర్మసం ♦ గ్రహణమునకు
యత్న మొనరింపఁగావలె ♦ నహరహంబు.

ఆ॥ అన్న మిడినవాఁడు ♦ నభయమిచ్చినవాఁడు
నుపనయనముఁజేసి ♦ యొప్పువాఁడు
కన్నతండ్రి యొజ్జ ♦ యెన్నఁ నీయేవురు
బితలనంగ జెల్లు ♦ బృథ్వి యందు.

క॥ తనయులు బంధులు మిత్రులు
ఋణబంధమువలన గలిఁగి ♦ ఋణము నశింపన్
జనుచుంద్రు, వారికొఱకై
మనమున జింతింపఁదగదు ♦ మనుజున కెపుడున్ 85

తే॥ ఆయువు, ధనంబు, సంగమ ♦ మౌషధంబు
మంత్ర మిలుచ్ఛిద్ర మవమాన ♦ మాన, దాన
ములను గోప్యంబుగానుంప ♦ వలయు గాని
పరుల కెఱిగింపఁగూడదు ♦ ప్రాజ్ఞుఁడిలను.

తే॥ పరులయింట భుజించుట ♦ బ్రాహ్మణులకు,
యుద్ధమొనరించుటే క్షత్రి ♦ యులకు, పచ్చి
కసవుమెసవుట యన్నగో ♦ గణములకును
ధవునిరాకయె స్త్రీలకు ♦ త్సవము లగును.

తే॥ జననిలేనట్టివానికి ♦ స్వగృహమొండు
లేనివానికి, గయ్యాళి ♦ యైనభార్య
గల యభాగ్యున కెందు సౌ ♦ ఖ్యంబు లేదు
గావున నరణ్యవాసంబె ♦ కరము సుఖము.

తే॥ అమితలోభంబు మూర్ఖత్వ ♦ మనృతవాక్య
నిర్దయత్వము కపటంబు ♦ నిష్ఠురంబు
సాహసంబు ననంగ నీ ♦ సప్తగుణము
లధమజాతి జనంబుల ♦ నంటియుండు.

తే॥ జలముననుచేప యడుగుల ♦ జాడనైన
శ్వేతవర్ణంపు వాయస ♦ జాతినైన

మేడిపువ్వుల నైనను ♦ జూడనగును
గాని స్త్రీల మనంబులఁ ♦ గాంచరాదు.

తే॥ సుగుణములు లేని నూర్వురు ♦ సుతులకంటె
సుగుణఖని యైన వాఁడొక్కఁ ♦ డగుట మేలు
పందిపిల్లలు పదియైన ♦ పాటిలేదు
ఆవుదూడ నొక్కటియైన ♦ నాదరింత్రు.

తే॥ జలజభవుఁడైన శివుఁడైన ♦ చక్రియైన
సురవియచ్చర గరుడ కిం ♦ పురుషులైన
ఫాలభాగంబునను వ్రాయఁ ♦ బడిన వ్రాత
మార్పఁజేయంగ లేరణు ♦ మాత్రమైన.

తే॥ ఖలుని కాంచనమును నిక్షు ♦ ఖండములను
దుష్టహయమును భేరిని ♦ దుష్టవనితఁ
దిలల హాంతకజనుల భూ ♦ తలమునందు
మర్దనము సేయవలెఁ గుణ ♦ మానితుండు.

క॥ చెడురాజును చెడుదేశము
చెడుబంధులు చెడుగుభార్య ♦ చెడుగ్రామంబుల్
చెడుమిత్రుని దూరంబుగ
విడనాడఁగవలయు జనుఁడు ♦ విజ్ఞానమునన్.

తే॥ సిగ్గుగల రోవెలందియు ♦ సిగ్గులేని
కులవధూటియు సంతుష్టిఁ ♦ గలుఁగు మనుజ
పతి యసంతుష్టి గనినట్టి ♦ బ్రాహ్మణుండు
జెడకవృద్ధిని బొందరు ♦ పుడమి నెపుడు.

తే॥ తనయు నై దేండ్లవరకును ♦ మనుజనాథు
పగిది పదియేండ్లదనుక సే ♦ వకునిభాతి
బదియునాఱేండ్లు నిండిన ♦ ప్రాణమిత్రు
వలెను జనకుండు భావింప ♦ వలయు ధరణి.

తే॥ బాల్యమున కన్నతండ్రి, యౌ ♦ వనమునందు
మగఁడు, ముదిమిని తనయులు,♦చిగురుబోండ్లఁ
గాచుచుందురు గాన నె ♦ క్కాలమందుఁ
గాని స్త్రీలకు స్వేచ్ఛ జ ♦ గానలేదు.

క॥ తెలియని మూర్ఖున కైనను
దెలుపంగా వచ్చుఁగాని ♦ తెలుపఁగ నగునే?
తెలిసియు దెలియని వానికి
నిలపై నజు నంతవాని ♦ కేనియుఁదలఁపన్.

చ॥ బలిసినవారి, వృద్ధుల, న ♦ భాగ్యతతిన్, గులహీను లైనవా
రలను, కురూపులన్, మఱిసి♦రక్షరకుక్షుల, నంగహీనులన్
ఇలపయిమానవుండయి జ♦నించిన వాఁడెవఁ డైన గాని తా
సలుపఁగరాదు హాస్యము వి♦చారవిహీనత,దానదోషమా

క॥ తనయింట మూర్ఖజనుఁడును
దనగ్రామము నందు ప్రభువు ♦ తనదేశమునన్
జనపాలుఁ డెల్లయెడలను
ఘనుఁడగు పండితుఁడు పూజఁ♦ గై కొనుచు రిలన్.100

తే॥ కాంతబాసిన పెరసతి ♦ చింతలేక
నర్థదేహంబు నిల్లాలి ♦ దంచునెంచి

కలనుసైతము పరకాంతఁ ♦ గాంచ నెంచఁ
డేకపత్నీవ్రతుండన ♦ నిట్టివరలు.

ఆ॥ భార్యలెందఱున్న ♦ పత్నీత్వమున వారి
సమతఁ జూచుచుండి ♦ జనుఁడు పరుల
మదిని దలఁపఁడేని ♦ మధ్యముం డనదగు
నింకనధముఁడెవఁడో ♦ యేర్పరింతు.

ఆ॥ అధముఁడేవగించు ♦ నాలిని గాంచిన
గుణము రూపురేఖ ♦ కోటులున్న
పొందులేక దూరి ♦ పోరాడుచుండును
స్వర్గమంచు లంజ ♦ వలపునమ్మి.

క॥ ఆపదఁబడి సతిఁ గోల్పడి
చేపట్టఁగ వేఱు వనిత ♦ చెడుగాదైనన్
లోపములఁబెంచి సతినెడ
బాపఁగ వేఱొక్కకన్యఁ ♦ బడయందవ్వా.

తే॥ స్వార్జితంబునగాని పి ♦ త్రార్జితమున
గాని మనుటయె ధర్మంబు ♦ మానవులకుఁ
భ్రాతృ స్త్రీవిత్తముల బొంది ♦ బ్రతుకుటన్న 105
నధమమని నిర్ణయము జేసి ♦ రార్య వరులు.

ఆ॥ పేదలైనవారిఁ ♦ బ్రేమించి కష్టముల్
తొలఁగఁజేయుటొప్పు ♦ కలిమి కొలఁది
యాచకులమాటంచు ♦ దోచెడి వారల
స్థితులఁగనక వారిఁ ♦ జేర్పరాదు.

తే॥ కలిమిలేములు నిల సహ ♦ కారమునను
మనుజులకుఁ గల్గుచుంటచే ♦ మానవాళి
సోదరులభాతి నన్యులఁ ♦ జూచుటొప్పు
పేదలని దొరలని వేఱు ♦ భేదమిడక.

క॥ కన్యావరవిక్రయముల
నన్యాపేక్షగలవార ♦ లైనను జేయర్
మాన్యులు మెచ్చరు భువి సా
జన్యము గాదనుచు నెపుడు ♦ జాటఁగవలయున్.

వ॥ ఈరీతి ధర్మములన్నియుఁజెప్పి యవసానకాలంబు మిక్కిలి సమీపంబగుడు సంగన్నగారు తన కులదేవుండగు శ్రీసంగమేశ్వరస్వామి నిట్లనిస్తుతించె.

—: అవసానకాలంబున సంగన్నగారు దేవునిస్తుతించుట :—

కందగర్భకందము.

ప్ర॥ క॥ అనిశంబు నిన్నుఁ దలఁచెడి
జనులన్ దగునట్టి రక్ష ♦ సల్పుచు, సుగుణా
వన కోర్కులిచ్చి చూతువు
జనకున్ పగిదిన్ గిరీశ ♦ సంస్తుత్యగణా. 110

ద్వి॥ క॥ తగునట్టి రక్షసల్పుచు
సుగుణావన కోర్కులిచ్చి ♦ చూతువు, జనకున్
పగిదిన్ గిరీశసంస్తు
త్యగణా! అనిశంబు నిన్నుఁ ♦ దలఁచెడి జనులన్.

చ॥ విపులసుఖంబులొందుటకు♦ విశ్వమశాశ్వతమంచెఱింగియా
తపసులు,భక్తకోటులుయు♦ దార్థముగానినుగొల్చుచుంద్రు, నీ
కృపఁదరియింపఁగా నిపుడు ♦ కేలుమొగిడ్చి భజించు వాఁడనే
నెపమునుజెప్పకుండ నిడు ♦ నిత్యపదమ్మును సంగమేశ్వరా.

ఉ॥ బొందినిజీవుఁడున్నపుడె♦పుత్రులు,భార్యయు,సేవకాళియుఁ
బందుగులాప్తు లందఱది ♦ బాసినతోడనె వెంటరారు, వి
స్పందియమిద్దిఁగాంచిజన♦సంఘమునిత్యమునిన్నుగొల్చుచుఁ
బొందగలారు ముక్తి బుధ ♦ పూజిత కూడలిసంగమేశ్వరా.

ఉ॥ ఇంటికిఁ గాలకింకరులు ♦ హెచ్చుగవత్తురు ప్రాణిఁజంపనీ
బంటులఁబంపి వారలను ♦ బారఁగఁద్రోలి సతంబునన్నునీ
వెంటవసించు నట్లొసఁగు ♦ వేగము యాజ్ఞల నట్లుగానిచో
గంటకులైనవారునను ♦ గావఁగఁజూడరు సంగమేశ్వరా.

చ॥ పరిపరివేడలేను,జ్వర ♦ భారము హెచ్చెను, మేనుడస్సె, నీ
పరమదయార్ద్రభావముల♦భక్తునినన్నొకప్రక్కఁజేర్పఁగా
శరణము వేడుచుంటినెక ♦సక్కముగాఁ దలపంగఁబోకుమో
నరనుత,భక్తపాలక,స ♦ నాతన కూడలి సంగమేశ్వరా.115

చ॥ ననుదరిఁజేర్చువాఁడవని ♦ నమ్మిభజించితినిన్నినాళ్ళు, నీ
తనువునరక్తమాంసములు♦ ధాతువులన్నియు క్షీణమయ్యెడిఁ
వినయముతోడ నొక్కపరి ♦ వేడెదశాశ్వతలోకమియ్యు, నా
మనవిగ్రహించిమోక్షమిడు ♦ మా జనవత్సల సంగమేశ్వరా.

వ॥ ఇట్లు పరమేశ్వరుని ధ్యానించుచు బంచాక్షరీమహామంత్రం
బుచ్చరించుచు సంగన్నగారస్థిరంబగు నీమానవ దేహంబు

విడచి కీర్తికాయంబుఁగొని దేవతానీత విమానారూఢుఁడై
స్వర్గలోకంబున కేగిన.

తే॥ అమరపురికట్లు సంగయా ♦ హ్వయుఁడువచ్చు
టెఱిఁగి బృందారకశ్రేణి ♦ యెదురువచ్చి
తోడుకొని పోవ దేవదుం ♦ దుభులు మొరసె
నప్సరోగణమెల్ల నృ ♦ త్యంబు సలిపె.

తే॥ అంత నాబాలగోపాల ♦ మప్పురమున
మిగుల విలపింపఁ దొడఁగిరా ♦ సుగుణరాశి
మరణమునకయి'సజ్జన ♦ మాన్యుఁడగుట
దొరకఁడెప్పుడు మనకిట్టి ♦ దొర'యటంచు.

సంగన్నగారికుమాళ్లు మరణించిన తండ్రికు త్తరక్రియలు జేయుట

వ॥ అంత నాతనికుమాళ్ళు నల్వురును తండ్రిగారి మరణమునకై
బలువిధంబుల దుఃఖించి "అనిత్యాని శరీరాణి" యను
పెద్దల వాక్యముం దలంచుకొని యూరడిల్లి, శ్రీసంగ
మేశ్వరస్వామివారి పరమభక్తుండగు దమ జనకునిభౌతిక
దేహంబా దేవుని సన్నిధినే యగ్నిసంస్కార మొనర్చు
టుచితంబని తలంచి. 120

తే॥ సంగమస్థల వట మహీ ♦ జంబు చెంత
నున్న పొలిమేరఁ జితిఁ బేర్చి ♦ యుక్తవిధిని
సంస్కరించి రప్పురిఁగల ♦ జనములెల్లఁ
జింతచేఁజూడఁగా తద ♦ నంతరంబ.

తే॥ మారహరునకు నాపోగ ♦ బారుకతన
దిరిగిసంప్రోక్షణముఁజేసి ♦ దేవళంబు
శుద్ధిగావింపఁగోరి రా ♦ చూరు ప్రభుని
జేరి ఛాందసుల్ కొందఱు ♦ జెప్పుకొనఁగ.

వ॥ అమ్మహీపాలుండును సవిస్తారంబంతయు గ్రహించి సంగన్న గారి మరణంబునకు జింతాక్రాంతుఁడగుచు నిట్లనియె.

తే॥ రుద్రభూమి నివాసుఁడౌ ♦ రుద్రుసకతి
ముదము గల్గు స్మశానంపు ♦ పోగను బీల్వ
నందులో భక్తవర్యుని ♦ దైవదీనిఁ
గోరఁడే! శుద్ధిపఱుపంగఁ ♦ గోరనేల?.

వ॥ ఇట్లని పల్కిన వారలు సిగ్గువడి మాఱువల్కక మఱలి పోయి రంత నిచ్చట సంగన్నగారి కుమాళ్ళు నల్వురును నిర్యుక్తకర్మములను స్వకులాచారా నుగుణ్యముగనొనర్చి కీర్తిశేషులగు దమ తండ్రిగారి పేరిటఁ బెక్కుదానధర్మంబుఁజేసి పేదవారి కవ్వారిగా నన్నదానంబుగావించిరంత.

తే॥ నల్వురును కీర్తిశాలురై ♦ నద్దెసలను 125
దాశరథులను బోలిన ♦ ధన్యులనఁగ
నొప్పిరంతట నగ్రజుం ♦ డప్పురమున
కెల్ల నధికారమును గాంచి ♦ యేలుచుండె.

క॥ జనకుఁ డిజారా బొందిన
జనపదము లరణ్యములను ♦ జక్కఁగఁ బరిపా

తే॥ మారహారునకు నాపోగ ♦ బారుకతన
దిరిగిసంప్రోక్షణముఁ జేసి ♦ దేవళంబు
శుద్ధిగావింపఁగోరి రా ♦ చూరు ప్రభుని
జేరి ఛాందసుల్ కొందఱు ♦ జెప్పుకొనఁగ.

వ॥ అమ్మహీపాలుండును సవిస్తారంబంతయు గ్రహించి సంగన్న గారి మరణంబునకు జింతాక్రాంతుఁడగుచు నిట్లనియె.

తే॥ రుద్రభూమి నివాసుఁడౌ ♦ రుద్రుసకతి
ముదము గల్గు స్మశానంపు ♦పోగను బీల్వ
నందులో భక్తవర్యుని ♦ దైవదీనిఁ
గోరఁడే? శుద్ధిపఱుపంగఁ ♦ గోరనేల?.

వ॥ ఇట్లని పల్కిన వారలు సిగ్గువడి మారువల్కక మఱలి పోయి రంత నిచ్చట సంగన్నగారి కుమాళ్ళు నల్వురును విధ్యుక్తకర్మములను స్వకులాచారా నుగుణ్యముగనొనర్చి కీర్తిశేషులగు దమ తండ్రిగారి పేరిటఁ బెక్కుదానధర్మంబుఁ జేసి పేదవారి కవ్వారిగా నన్నదానంబుగావించిరంత.

తే॥ నల్వురును కీర్తిశాలురై ♦ నద్దెసలను 125
దాశరధులను బోలిన ♦ ధన్యులనఁగ
నొప్పిరంతట నగ్రజుం ♦ డప్పురమున
కెల్ల నధికారమును గాంచి ♦ యేలుచుండె.

క॥ జనకుఁ డిజారా బొందిన
జనపదము లరణ్యములను ♦ జక్కఁగఁ బరిపా

లన సల్పుచుండ నాతం
డనుజ సహిత పాండుపుత్రుఁ ♦ డనఁ బేరొందెన్.

క॥ ఆతమ్ముఁ జెప్పఁడగ్రజు
చేతల కాజ్ఞలకు ముదముఁ ♦ జెందుచు నుండెన్
ఖ్యాతివహించెను నరసయ
యాతని భాగ్యంబుఁ బొగడ ♦ నజునకు వశమే?.

వ॥ ఇట్లా సోదరచతుష్టయము దమ గ్రామములం బాలించుచు ప్రభువులచే సామంతులుగా నెన్నంబడుచు పెక్కుచోట్ల నిర్మలజలపూరితంబులగు బావులఁ ద్రవ్వించి పారమార్థిక చింతతో బ్రతికార్యమును సమర్థతతో నిర్వహించుచు శ్రీ సంగమేశ్వర స్వామివారి ధర్మకర్తృత్వభారము వహించి యేటేట నుత్సవంబు లమితవైభవంబున జేయించు చున్నంత.

సీ॥ ఏనెర దాతల ♦ దానధర్మంబులం
బుడమి కల్పక తరు ♦ స్ఫూర్తిఁ నొందె
నేజ్ఞానశీలుర ♦ ప్రజ్ఞా బలంబునం
బుడమి సరస్వతీ ♦ స్ఫూర్తిఁ నొందె
నేమానధనుల య ♦ సామాన్య కృషిచేతఁ
బుడమి వైశ్వర్య వి ♦ స్ఫూర్తిఁ నొందె
నేయుదారులు బ్రోచు ♦ గాయకమణులచేఁ
బుడమి చింతామణీ ♦ స్ఫూర్తినొందె

తే॥ నేరి కరుణామృతం బార్తు ♦ లెల్లఁ గోలఁ
బుడమితల మెల్ల నమృత వి ♦ స్ఫూర్తినొందె

నట్టి మహాసియు లుండెడి ♦ యవనితలము
సురతలంబున కెనయన్న ♦ జోద్యమగునె?. 130

వ॥ ఇట్లాసోదరు లసమానకీర్తి కాములై మెలంగుచు.

తే॥ ధర్మకార్యంబు లెన్నోయు ♦ దారబుద్ధిఁ
జేయుచుండిరి నల్వురా ♦ శ్రితులఁదన్పి
పెనుగుదురుపాటిలో స్వామి ♦ విగ్రహముల
సీతయాఖ్యుండు నిర్మించి ♦ ఖ్యాతిఁగాంచె.

వ॥ ఇట్లుండ నొక్కనాఁడు భావయ్యగారు నిజసేవక సహితుండై రాచూరు ప్రభునికడ కేగుచుఁ ద్రోవలో దనకు మృష్టాన్న భోజనము బెట్టు నొకపూటకూలి యవ్వకడ కేగి యామె చింతాక్రాంతయై యుండుటయు నాతండు కారణం బడిగిన నామెయు దనపాలిటి కామధేనువుగ నుండిన గేదె యొకటి మొన్ననే మరణించెనని పల్కిన దయాంతఃకరణుండగు నతండు వెంటనే యొకటి గొనియిచ్చె. ఈరీతి ధర్మతత్పరులై మెలంగి వీరు నల్వురు వరుసగా నొకరివెంబడి నొకరు పెక్కేండ్లు తమ యిజారాగ్రామంబులం బాలించు చున్నంత.

తే॥ భారతుల రామయాఖ్య వి ♦ ప్రవరు గృహము
తండ్రి గట్టించినది యగ్ని ♦ దగ్ధమైనఁ
దిరిగి నిర్మాణమొనరించె ♦ సరసగుణుఁడు
భావయాహ్వయుఁడు నుదార ♦ భావమొప్ప.

వ॥ ఇట్లు మెలంగుచు రాజపూజ్యులై గ్రమక్రమంబున కాలంబువాసి శాశ్వతబ్రహ్మలోకంబు నొందిరంత.

♦ సంగన్నగారి జ్యేష్ఠకుమారుఁడు నరసయ్యగారి వంశము-♦

తే॥ శుభచరిత్రుఁడు నరసయ ♦ సూనుఁడైన
మూళయాఖ్యుండు గాంచెను ♦ మోదమెసఁగఁ
దనయు నొక్కని సద్గుణ ♦ ఖనిని ఘనుని
వేంకటప్పయ నాముని ♦ విదిత యశుని.

వ॥ ఇతండును బహుపరాక్రమ తేజోవంతుఁడై యిర్వురు భార్యలం బెండ్లాడి వారలవలన సంతానభాగ్యంబు గల్గియు నిల్వమింజేసి.

ఆ॥ వెంకటప్పయాఖ్య ♦ విమల యశోధని
సుతులులేక దత్త ♦ సూను గొనియె
సంగయాఖ్య పుత్రు ♦ సద్గుణ శీలుని
సరసు కవివరేణ్యు ♦ జగ్గయాఖ్యు.

వ॥ ఇతండు శ్రీసంగమేశ్వర తారావళి, పాపవినాశ శతకము పన్నాచరిత్రము మున్నగు గ్రంథములను రచించె. ఇయ్యవి సర్వజన మనోరంజకంబులయ్యె.

-:సంగన్నగారిద్వితీయపుత్రరత్నమగు భావయ్యగారివంశము.:-

తే॥ భావయాహ్వాయుని కుమార. ♦ పంచకమున
నగ్రజుఁడు సీతయాఖ్యుండు ♦ నమితదర్ప
శాలియై యాపురశ్రేష్ఠ ♦ పాలనంబు
సర్వజనరంజకంబుగ ♦ సల్పుచుండె. 140

వ॥ ఆతండును కొల్లి సుబ్బయ్యగారి కుమారీరత్నమగు రత్న
మ్మను పరిణయంబై సంతానంబు గల్గమింజేసి.

తే॥ సుతులు లేనట్టి వారికి ♦ గతులు గలుఁగ
వనెడు పెద్దలవాక్యము ♦ నాలకించి
సీతయాఖ్యుండు జగ్గయ ♦ చిన్నకొమరు
సుబ్బరాయాహ్వయుని దత్త ♦ సూనుగఁగొనె.

తే॥ సుబ్బరాయాఖ్యుఁడంతట ♦ సుతునిఁగాంచె
భాగవత శిష్యుఁడగు వీర ♦ భద్రయాఖ్యు
నధికవిజ్ఞానవంతుఁడై ♦ యలరువాని
విమలవేదాంత విజ్ఞాన ♦ వేత్తనెలమి.

వ॥ అంత.

సీ॥ ఎవ్వాఁడు దుర్గపు ♦ రీశుఁడై జనములఁ
బాలించెఁదన తనూ ♦ భవులమాఁక్కి
నెవ్వాఁడు యాచక ♦ హితుఁడన బేర్గాంచి
దానధర్మంబులఁ ♦ దనిపెవారి
నెవ్వాఁడు నెలకొల్పె ♦ నింపారుచున్నని
త్యాన్నసత్రము ను వి ♦ ద్యాలయంబు
నెవ్వాఁడు పౌరుల ♦ యాప్తితంబెటిఁగి యె
న్నెన్నొపనుల్ జేసి ♦ వన్నెకెక్కె

తే॥ నతఁడు జంపాలవంశ సు ♦ ధాకరుండు
సుబ్బరాయాహ్వయుఁడు; ♦ వానిసోదరుండు
మహితగుణశాలి కొండయ ♦ మాన్యగూతు
రత్నమాంబను ♦ వీరభద్ర వరుఁడంత. 145

తే॥ పరిణయంబయ్యె బహుతపః ♦ ఫలమటంచు
ధారుణీ ప్రజబొగడనా ♦ దంపతులును
తనయునొక్కని సద్గుణ ♦ ధాము ననఘు
సచ్చిదానంద యుక్త ప్ర ♦ సాదుఁ గనిరి.

వ॥ భావయ్యగారి ద్వితీయకుమారుండగు బుచ్చయ్యగారును కొంతవరకు గ్రామపాలనంబొనర్చి పిదప నప్పటికి రాజ్యమాక్రమించిన యీస్టిండియా కంపెనీవారి పాలనలో సముద్దారుద్యోగమున బ్రవేశించి యమిత కీర్తివంతుఁడై తనకు లోబడియున్న గ్రామముల ప్రజల నెక్కుడు ప్రేమఁ బోషించుచున్నంత నొక్కనాటి కాలంబున.

తే॥ వర్షములు లేక పంటలు ♦ బండవయ్యె
సస్యములు మాడిపోయెను ♦ జంతువులకు
గసవుగలుగమి రైతులు ♦ కష్టపడిరి
దుగ్గిరాలలో నియ్యది ♦ దోచె మిగుల.

వ॥ అంత నగ్గ్రామంబును దక్కుంగల గ్రామంబులును వీక్షించి దయార్ద్రహృదయుండగు బుచ్చయ్యగారు పాలకులకు వ్రాసి శిస్తుమినహాయింపు జేసె.

తే॥ పండితశ్రేష్ఠుఁ డాశ్రిత ♦ పక్షపాతి
కవివరేణ్యుం డుదారుండు ♦ ఘనుఁ డనఘుఁడు
నర్థిజన పోషకుండు స ♦ మర్థుఁడెందు
బుచ్చయాభిధునకు సాటి ♦ పుడమి గలరె? 150

వ॥ మఱియునితండు హరిశతకంబొక్కటి రచించె. ఈతండును జంపాల పేరయ్యగారి కుమార్తె నందమ్మను పరిణయంబై.

క॥ హెచ్చగు భగవత్పూజల
బుచ్చావధానయుఁ డొనరుపంగఁ ♦ బుట్టిరి కొమరుల్
సచ్చరితుఁడు గోపాల్ రా
వచ్చలుఁడగు రామకృష్ణ ♦ యాఖ్యుఁడనంగన్.

క॥ గోపాలరాయ నామ మ
హీపాలుం డమిత ధైర్య ♦ మేపారంగా
వ్యాపార కుశలుఁడయ్యెను
ప్రాపయి బంధుజనమెల్ల ♦ భళియనిపొగడన్.

తే॥ అతనికిద్దఱు జన్మించి ♦ రబ్జముఖులు
కుప్పమయు రంగమాంబనా ♦ గూర్మిసుతలు
వారిలో రంగమాంబ జం ♦ పాల వెంక
టప్పయావధానయుఁ బెండ్లాడె, ♦ కుప్పమాంబ
క్రొత్తపులివంశు క్రేష్ఠయా ♦ ఖ్యుని వరించె.

తే॥ ఘనుఁడు గోపాలరావుగా ♦ రిని దరింప
రంగమాంబకుఁబుట్టి ర ♦ వంగసములు
రమ్యగుణశాలి గోపాల ♦ రావు భక్త
వరుఁడు నారాయణుండనం ♦ బడెడి సుతులు. 165

వ॥ వీరిద్దఱు మాతామహుండగు గోపాలరావుగారికి దౌహిత్రులైరి. ఇఁక వీరు జంపాల వంశీయులైరి.

తే॥ ఆంగ్ల విద్యాధికుండన ♦ నధికకీర్తిఁ
గొన్న గోపాలరావు వి ♦ ద్వన్నుతుండు
సాహసోదారవంతుఁడై ♦ చక్రవర్తి
పాలనన్ దహసీల్దారు ♦ పదవినందె.

తే॥ రామకృష్ణాఖ్యుఁడును ధర్మ ♦ రాజనంగ
బేరుఁగాంచి వివాహముల్ ♦ పేదజనుల
కెన్నొ సమకూర్చి చేయించి ♦ వన్నెకెక్కె
బుచ్చయ కుమారుఁ డతనికి ♦ బుట్టెనంత.

—♦ రామకృష్ణయ్యగారు వినాయకదేవుఁ బ్రతిష్ఠించుట ♦—

సీ॥ ముక్కంటి దొరగారి ♦ ముద్దులబిడ్డఁడై
యఖిల విద్యాగురుం ♦ డయ్యె నెవఁడు
రాజితశౌర్యప ♦ రాక్రముండయి దేవ
గణనాయకుండన ♦ గ్రాలె నెవఁడు
పాపకార్యంబులఁ ♦ భగ్నంబుఁ గావించి
విఘ్నేశ్వరుండన ♦ వెలసె నెవఁడు
ముల్లోకములవార ♦ కెల్లఁ బెద్దయనంగఁ
బ్రథమ పూజాదులఁ ♦ బడసె నెవఁడు

తే॥ మోదకంబులు బెట్టఁగా ♦ ముచ్చటపడి
యీప్సితంబుల భక్తుల ♦ కిచ్చు నెవఁడు
దివ్యుఁడగు నావినాయక ♦ దేవు పూజఁ
బ్రజలు భక్తిని సలుప దే ♦ వశము లేని.

వ॥ మఱియునితండు హరిశతకంబొక్కటి రచించె. ఈతండును జంపాల పేరయ్యగారి కుమార్తె నందమ్మను పరిణయంబై.

క॥ హెచ్చగు భగవత్పూజల
బుచ్చాపుహ్వాయుఁ డొనరుపంగఁ ♦ బుట్టిరి కొమరుల్
సచ్చరితుఁడు గోపాల్ రా
వచ్చలుఁడగు రామకృష్ణ ♦ యాఖ్యుఁడనంగన్.

క॥ గోపాలరాయ నామ మ
హీపాలుం డమిత ధైర్య ♦ మేపారంగా
వ్యాపార కుశలుఁడయ్యెను
బ్రాపయి బంధుజనమెల్ల ♦ భళియనిపొగడన్.

తే॥ అతనికిద్దఱు జన్మించి ♦ రబ్జముఖులు
కుప్పమయు రంగమాంబనా ♦ గూర్మిసుతలు
వారిలో రంగమాంబ జం ♦ పాల వెంక
టప్పయాహ్వాయుఁ బెండ్లాడె, ♦ కుప్పమాంబ
శ్రోత్రపులివంశు క్రిష్టయా ♦ ఖ్యుని వరించె.

తే॥ ఘనుఁడు గోపాలరావుగా ♦ రిని దరింప
రంగమాంబకుఁబుట్టి ర ♦ నంగసములు
రమ్యగుణశాలి గోపాల ♦ రావు భక్త
వరుఁడు నారాయణుండనం ♦ బడెడి సుతులు. 165

వ॥ వీరిద్దఱు పితామహుండగు (మా) గోపాలరావుగారికి దౌహిత్రులైరి. ఇఁక వీరు జంపాల వంశీయులైరి.

తే॥ ఆంగ్ల విద్యాధికుండన ♦ నధికకీర్తిఁ
గొన్న గోపాలరావు వి ♦ ద్వన్నుతుండు
సాహసోదారవంతుఁడై ♦ చక్రవర్తి
పాలనన్ దహసీల్దారు ♦ పదవినందె.

తే॥ రామకృష్ణాఖ్యుఁడును ధర్మ ♦ రాజనంగ
బేరుఁగాంచి వివాహముల్ ♦ పేదజనుల
కెన్నొ సమకూర్చి చేయించి ♦ వన్నెకెక్కె
బుచ్చయ కుమారుఁ డతనికి ♦ బుట్టెనంత.

—♦ రామకృష్ణయ్యగారు వినాయకదేవుఁ బ్రతిష్ఠించుట ♦—

సీ॥ ముక్కంటి దొరగారి ♦ ముద్దులబిడ్డఁడై
యఖిల విద్యాగురుం ♦ డయ్యె నెవఁడు
రాజితశౌర్య ప ♦ రాక్రముండయి దేవ
గణనాయకుండన ♦ గ్రాలె నెవఁడు
పాపకార్యంబులఁ ♦ భగ్నంబుఁ గావించి
విఘ్నేశ్వరుండన ♦ వెలసె నెవఁడు
ముల్లోకములవారి ♦ కెల్లఁ బెద్దయనంగఁ
బ్రథమ పూజాదులఁ ♦ బడసె నెవఁడు

తే॥ మోదకంబులు బెట్టఁగా ♦ ముచ్చటపడి
యీప్సితంబుల భక్తుల ♦ కిచ్చు నెవఁడు
దివ్యుఁడగు నావినాయక ♦ దేవు పూజఁ
బ్రజలు భక్తిని సలుప దే ♦ వళము లేదు.

వ॥ రామకృష్ణయ్యయు దైవభక్తిపరాయణుండై యొక్క
గద్దెఁగట్టించి యందు వినాయకదేవుం బ్రతిష్ఠించి యుప
సానకాలంబున నద్దేవున కాలయంబు గట్టింపఁ గుమారున
కాజ్ఞ యొసంగె. ఈయన తదనంతరము పితృవాక్యపరి
పాలనా దక్షుండగు బుచ్చయ్యగారును తదాలయము
గట్టించి పేరొందె. ఇతండును గొంతకాలము నేకూరు,
శెలపాడు గ్రామముల కధికారియై మెలంగుచున్నంత. 160

తే॥ బుచ్చయార్యునకు సుతుల్ • బుట్టిరిలను
వీరభద్రార్యుండును • వెంకటేశ
సంగమేశ్వరరావులు • రంగరావు
ననెడి విద్యానిధులు సుగు • ణాకరులును.

వ॥ ఇందగ్రజుండగు వీరభద్రాభిధేయుండు రామకృష్ణుండను
నామంబుగూడఁ బడసి.

తే॥ ఆంగిలేయుల విద్యల • నార్జనంబుఁ
జేసి పట్టభద్రుండయి • సీమకేగె
భూరివిద్యావివేకంబుఁ • బొందఁగోరి
యై. సి. యస్సాది బిరుదము • లందఁదలఁచి.

వ॥ ఇఁక భావయ్యగారి మూడవ పుత్రుండగు జగ్గయ్య
సీతయ్యగారికి దత్తపుత్రుండయ్యె, నిఁక నాల్గవపుత్రుండగు
సంగయ్యగారి వృత్తాంతం బెట్లనిన.

క॥ కవిజన మందారుండన
నెవఁడర్థిజనాళిఁ బ్రోప • నెవ్వఁడు కర్ణుం

డవనీస్థలమున నన్నఁగా
వివరింతురు సంగయాఖ్యు ♦ విధమును మొదటఁగా. 165

వ॥ ఈతండును శ్రీసంగమేశ్వరస్వామి యందుగల యమిత భక్తిచే నాంధ్ర సంగమేశ్వర స్థలపురాణంబొక్క సత్కవిచే వ్రాయించి కీర్తివహించి, పితామహుండగు సంగన్న గారికీర్తి హెచ్చించె. మఱియు నితండును దుగ్గిరాల వాస్తవ్యులగు జంపాల బాపయ్యగారి కుమార్తె మీనాక్షమ్మను పరిణయంబయ్యె నంత.

తే॥ మీనలోచన పద్మాస్య ♦ మీనమాంబ
భువనమోహినియును కీర్తిఁ ♦ బొంది తనదు
పతికి సంతతమనుకూల ♦ వతిగ మెలఁగి
భావజునిగూడు నారతి ♦ దేవియనఁగ
భావజునిగూడి కాంచె నా ♦ భాగ్యగరిమ.

వ॥ మఱియు.

తే॥ వెంకటాద్రీంద్రుసతి తన్ను ♦ పిన్ననాడు
దుగ్గిరాలలో జనకుని ♦ స్వగృహమునను
బసనొనర్చిన దినముల ♦ బహువిధములఁ
బుజ్జగించిన దానికై ♦ మఱియు నెపుడు.

వ॥ ఇట్టికాంతారత్నంబుతో నత్యంత సౌఖ్యవంతుండై సంగయాఖ్యుండున్నంత. 170

తే॥ సంగయాఖ్యునికిని సుతుల్ ♦ జననమైరి
సాహసౌదార్య వితరణ ♦ శాలు లనఘు

లందు వెంకటకృష్ణయ ♦ యగ్రజుండు
ధీరులగు శివల్ంగయ ♦ సూరయాఖ్య
భావయాహ్వయులనియెడి ♦ భ్రాతృవరులు.

వ॥ ఇందు.

క॥ శివలింగయనామ తనూ
భవుఁడవయితివీవు శుక్ల ♦ వత్సరమందున్
శివరాత్రి వాసరంబున
భవమొందుట, నీదుజనకు ♦ భాగ్యంబేమో.

వ॥ ఇఁక సూరయనాముండు వివాహానంతరము పుత్రసంతా
నంబు నొందకయే యకాలమృత్యువు పాలయ్యె.

క॥ వెంకటకృష్ణాఖ్యునకక
లంక చరిత్రులగు సుతులు ♦ రాజిల్లిరిలన్
వెంకట రామాహ్వయుఁడును
శంకరపదభక్తి యుతుఁడు ♦ సంగాహ్వయుఁడున్. 175

సీ॥ వీరిద్దఱిల్లుండ ♦ వెంకన్న కుదిటిలో
సంగయాహ్వయునకు ♦ సంతులేమి
సంగయాఖ్యుని బెంప ♦ సాగెనతండును
వెంకయాఖ్యుండను ♦ పేరఁబఱఁగె
వెంకటరామయ్య ♦ వెంకయాఖ్యులు మగ
సంతులేకుండయె ♦ చనిరి దివికి
శివలింగయాఖ్యుచే ♦ జన్మొందినీవును
సాహసవితరణ ♦ శాలివయ్యు

వినుత చల్లావంశ ♦ విబుధుఁడౌ విశ్వనా
థగురూపదేశ ♦ విస్తారమహిమ
తే॥ సంగమేశ్వర శ్రీరామ ♦ చంద్రదేవ
భక్తిచేనలరారుచు ♦ ముక్తిమార్గ
గామియై సజ్జనులగోష్ఠి ♦ గడపుదీవు
పండితవిధేయ సౌభాగ్య ♦ వశము కతన.

వ॥ ఇదియునుంగాక.

సీ॥ ఏయశోనిధి పూర్వు ♦ లింద్రవైభవములఁ
బలివర్తి సమితిలో ♦ పల వసింతు
రేసద్గుణాకరుఁ ♦ డీవసుధాస్థలి
బహుజనస్తవనీయ ♦ భాగ్యయుతుఁడు
ఏధీరుఁడర్థుల ♦ కిచ్చి వాంఛితముల
నెరదాతయనుపేరఁ ♦ బరగినాడు
ఏమహాత్ముఁడు చాల ♦ భూములనార్జించి
చిరతర సత్కీర్తిఁ ♦ జెందినాడు
తే॥ చామరల్పురి నివసించు ♦ జనములెల్ల
నెవని ధీవిభవంబున ♦ నేకవిధులఁ
బొగడుచుందు రిప్పటికి నా ♦ పుణ్యపురుషుఁ
డధికతేజోయుతుఁడు భావ ♦ యాభిధుండు
ఘనుఁడు ముమ్మలనేన్వంశ ♦ దినకరుండు.

వ॥ ఆభావయ్యగారి ద్వితీయ పుత్రికయగు రాజమాంబను సీవధికోత్సాహంబునం బరిణయంబై పుత్రత్రయంబు గంటి వింక నీసోదరుండు.

తే॥ సరసచాతుర్య వాక్ప్రౌఢి ♦ సభలఁ బేరు
పడ్డభావయనాముండు ♦ ప్రాజ్ఞఁ డొక్క
పుత్రుఁగాంచె ద్వితీయ క ♦ ళత్రమందు
సంగమేశ్వరరావను ♦ చతురమతిని. 180

క॥ భవదీయ తనూభవులై
ప్రవిమలురగు సంగయాఖ్య ♦ భావయనాముల్
కవివర్యులు శుభచరితులు
శివకేశవభక్తులనఁగఁ ♦ జెలఁగిరి ధరణిన్.

వ॥ ఇందేను భావయ్య యనువాఁడ. మాకుజనించిన మూఁడవ తనయుండగు పట్టాభిరామ నామధేయుండు 12 వ వర్ష ప్రాయంబుననే మృతిం జెందె. మదగ్రజుండగు సంగయ్యగారును కవీశ్వరుఁడై సిద్ధార్థశతకంబు రచించి కీర్తిఁగాంచె నిదింగాక.

చ॥ సరసుఁడు సంగయాఖ్యుఁడును శాంతమతుల్ వినయప్రవర్తనుల్
పరమదయాసముద్రులును♦పావనులంచు బ్రశంసఁగాంచుము
ప్వురసుతులన్ గనెన్ వరుసపుణ్యులనాగయ,కృష్ణమూర్తిచో
దరులను నారసింహమును♦ ధన్యుఁడితండని లోకులాడఁగా.

వ॥ ఇందు నరసింహనాముండు బాలారిష్టదోషంబునమరణించె. నాకింకను సంతానంబులేదు. ఏనును పిన్నతనంబున నాంధ్రాంగ్లేయభాషలఁ గొంతవరకునేర్చి క్రీ॥ శ॥ 1916-25 వత్సరములమధ్యడిప్యూటీసర్వేయరునామకప్రభుత్వోద్యోగినై యనేకపట్టణంబులు పల్లెలు దర్శించి తుదకాయుద్యో

గమున విరక్తిఁజెంది మరలివచ్చి యేనురచించిన గోపాల శతక ప్రకటనానంతర మీగ్రంథము వ్రాయంబూనితి. ఇంక పట్టయ్యగారి వంశంబభివర్ణించెద.

సీ॥ హాళికాగ్రేసరుం ♦ డై నిజపాండితీ
గరిమచేఁ బోతన ♦ సరి యనంగ
నతిథి యభ్యాగతా ♦ ద్యర్చన లందున
బ్రవరాఖ్యుఁడేయని ♦ ప్రస్తుతింప
బ్రహ్మాదిదేవతా ♦ ప్రస్తుతుఁడై యొప్పు
ప్రహ్లాదుఁబోలు స ♦ ద్భక్తుఁడనఁగ
యాచకాళికి దృప్తి ♦ యగు ధనమొసగంగ
నలకర్ణుఁడేయని ♦ యభినుతింప.

తే॥ జాలు గుణధాము, కొత్తవం ♦ శాబ్ధి సోము
కోమలాంగకు బట్టయ ♦ నాముఁగాంచి
నిర్భరానందమగ్నులై ♦ నియతి ప్రజలు
వాని కనుసన్నల మెలంగ ♦ వచ్చుచుండ్రు. 185

వ॥ ఇతండును జంపాల పేరయ్యగారి కుమార్తె సుబ్బమ్మను వివాహంబై, కొంతకాలము సర్వేయ రుద్యోగముంజేసి తిరిగివచ్చి, శ్రీసంగమేశ్వరస్వామి కార్యంబులన్నియు నిర్వహించుచు, సోదరుల వరుస నెంబడి తానును గొన్నాళ్లు శ్రీసంగమేశ్వర దేవాలయ ధర్మకర్తగా నున్నంత.

తే॥ పట్టయాఖ్యుని కార్గురు ♦ పరమభక్తు
లనఁగ సుపుత్రులు జన్మించి ♦ ఖ్యాతిఁగనిరి

భావయ, ముకుందరాయులు ♦ పండితులన
రామస్వామియపార శౌ ♦ర్యధనుఁడనఁగ
వెంకటప్పయ నరసింహ ♦ వీరవరులు
సాంబయాఖ్యుండు నావీరు ♦ సరసులనఁగ.

వ॥ ఇందు రామస్వామి వ్యవహార దక్షుండై పెక్కు వివాహ సమ్మేళనములొనర్చి యనేకగ్రామములఁ బేరొందె. ఈయన కొంతకాలమొక్క గ్రంథాలయమునకు, మఱికొంత కాలము పంచాయతీసభకు సభ్యుఁడై కార్యక్రమము లతిశ్రద్ధతో నెరవేర్చె. వెంకటప్పయ్య వ్యాపార కుశ లుండయ్యె.

ఖ్యాతింజెందముకుందరాయవరుడుఁగాంచెఁ సుతశ్రేష్ఠులఁ
సీతారామయ వెంకటేశ్వరులు నా♦శ్రీమంతులఁ వారిలో
సీతారామయ హూణరాజ్యప్రజ ర♦క్షింపంగ నుద్యోగియై
ఖ్యాతింగాంచెను వెంకటేశ్వరుఁడునిష్కాపట్యుఁడై యొప్పఁగఁ.

తే॥ భావయ, నృసింహ, సాంబయా ♦ హ్వాయులు నరిగి
రంత పుత్రులఁ గాంచక ♦ నమరపురికి
భావయాఖ్యుండు మాత్రము ♦ బడయఁగల్గె
రంగమాంబయఁ గూతుగు ♦ రంగనేత్ర. 190

వ॥ ఈమె జంపాల రామస్వామిగారి కిచ్చి వివాహం బొనర్పఁ బడిమె.

తే॥ రామస్వామియును ముకుంద ♦ రాయ సుతులఁ
గాంచి మనమున దృప్తి వ ♦ హించియుండె.

వెంకటప్పయు నామ వి ♦ వేక ధనుఁడు
సుగుణశీలుఁడు సంతాన ♦ శూన్యుఁడయ్యె.

వ॥ వీరిద్ద ఱొక్క దివ్యసౌధము గట్టించుకొని రియ్యది గ్రామ వాసులకు బెద్ద కార్యంబుల పట్ల మిక్కిలి యనుకూలముగ నుండె.

-♦ సంగన్నగారి తృతీయ సుతుండగు సీతయ్యగారి వంశము ♦-

ఉ॥ సంతతిలేమినిర్మల వి♦శాలమనస్కుఁడు సీతయాఖ్యుఁడున్
జింతిలి మానసంబునను ♦ శ్రేష్ఠుని భావయ పుత్రుజగ్గయన్
సంతసమొప్పదత్తుఁగొని ♦ సాకఁగనాతఁడుశౌర్యధుర్యుఁడై
కంతుహసించుపుత్రులను♦గాంచెనుముప్పుర త్యాగశీలురన్.

క॥ నరసయ, సుబ్బారాయుఁడు
సరసశ్రేష్ఠులన రామ ♦ స్వామియు సుగుణా
కరుఁడన వెలసిరి ముప్పురు
గురుతర హేమాద్రి ధరుని ♦ కూరిమిభక్తుల్. 195

తే॥ సర్వజనసముఁడంచు య ♦ శంబుఁ గాంచి
గ్రామపాలనఁ జేసె జ ♦ గ్గయ్యగారు
కొల్లిసుబ్బావ్వాయు ననుంగు ♦ కూతురైన
పరమసాధ్వి యానందమ్మ ♦ పత్నిగాఁగ.

వ॥ ఇట్లుండ నొక్కనాటి సమయమ్మున నాతండు పురాణకాల క్షేపంబుఁ గావించుచుండ నందు.

తే॥ చంద్రసూర్య గ్రహణముల ♦ సమయమందు
బితరులకు తర్పణము లిడి ♦ విప్రజనులఁ

భూరి దానంబులం దన్పు ♦ పుణ్య జనులు
కడకు నుత్తమలోకముల్ ♦ గాంచుచుంద్రు.

వ॥ ఇదియునుంగాక నమ్మహానీయులు జ్యోతిర్మండలంబున నాసు ధాకర, దివాకరులున్నంత వరకు వెలుంగుచు వసించుదు రని యప్పురాణ కథాసందర్భంబున నుండుటయు నద్ధర్మంబు గాఢంబుగా మనంబున నాటుకొనిన జగ్గయాభిధేయుండు కొన్నాళ్ళకు తానట్టి కర్మంబాచరింప సంకల్పించి యున్నంతఁ గార్తిక పూర్ణిమాదివసంబున.

-♦జగ్గయ్యగారు చంద్రగ్రహణకాలంబున గోదానంబిచ్చుట.♦-

తే॥ హిమకరగ్రహణమువచ్చు ♦ నెఱిఁగి యాతఁడు
పితరులకు తర్పణమ్ములఁ ♦ బ్రీతి విడువ
నెంచి శాస్త్రోక్త దానము ♦ లియ్యఁదలఁచి
బ్రాహ్మణోత్తము లగువారి ♦ వరుస నడుగ. 200

వ॥ వారలెల్ల రిట్లనిరి. మహాత్మా! నీకుం గోర్కె గలదేని యిదిఁ గాక నీకుం బ్రాప్తంబయ్యేనేని గ్రహణ కాలంబునకు సరిగా నీనుచున్న గోరత్నంబును బ్రాహ్మణోత్తమునకు దానంబు జేసితివా, నిజన్మంబు ధన్యంబయగును. దానికి సాటి యాన్యంబు లేదు. షోడశ మహాదానంబు లన్నింటి కన్న నిది మిన్నయగు.తొల్లి వెంకటాద్రి ప్రభువర్యుం డట్టి దాన ఫలం బాసించి గోసహస్రముంబట్టి తెప్పించి గ్రహణ కాలంబునం గట్టివెచిన. నందొక్క ధేనువు మాత్రమే దానార్హంబయ్యె గావున నిట్టి సర్వోత్కృష్టమైన దానం

బును భూసురోత్తము నొక్కనికిం జేయుమనిన వల్లెయని హర్షపులకితాంగుండై యట్టి గోవు కొఱకు విచారించు చున్నంత.

తే॥ అతని భాగ్యవిశేషమా ♦ యన్నకరణి
సోదరుఁడు పట్టయాఖ్యుని ♦సుతులు బెంచు
నాలమందలో నొక నిండు ♦ చూలుధేను
వీనునట్టులఁ గాన్పింపఁ ♦ గానె యపుడు.

క॥ సోమోపరాగమున నతి
సీమమ్మున జేయుదాన ♦ నిర్ణయమునకై
యేమూల్యమైన నైకొని
యామొదవు నొసఁగుఁడంచు ♦ నానతి సేయన్.

క॥ తమపాలి దైవముంబలె
శ్రమయనకయె పెంచుచున్న ♦ సాధుమృగంబు
త్తమవంశజుఁడగు విప్రున
కమరఁగ నర్పణముసేయు ♦ టన మోదమునన్.

వ॥ ధర్మాభిలాష మనంబుల వెల్లివిరియగ వారా ధేనువు నొసంగి రంత నద్దానిని జగ్గయభూపాలుండు గ్రహణ కాలంబున విప్రోత్తముండగు తూటుపల్లి సీతారామవర్యు నకు దానంబిచ్చిన నాతండును ముదంబున బరిగ్రహించె. తక్కంగల విప్రజనుల కవ్వారిగా హిరణ్యాది దానంబులం జేసి వారిని సంప్రీతులం గావించె నమ్మహోత్సవ సందర్శనాభిలాషులైన పురజను లయ్యదిగాంచి యపరిమితో త్సాహంబున.

క॥ మున్నన్నఁ డెఱుఁగమిట్టిది
గన్నారము మాదుభాగ్య ♦ గరిమనటంచా
పున్నము రేయిని వారలు
సన్నుతులనొనర్చి రంత ♦ జగ్గయభూపుఁ.

వ॥ ఇట్లెన్నియో దానధర్మంబులం జేసి కీర్తిశాలియై మెలంగుచు తదుపరి కొంతకాలంబున కాతండు గ్రామపాలనంబును శ్రీసంగమేశ్వరస్వామివారి దేవాలయ ధర్మకర్తృత్వమును కుమాళ్ళకును, సోదరులకు నప్పగించి వారెల్లరా రెంటి నైకమత్యముతో నిర్వహింపుటకా దేశించి గతించిన.

—♦ నరసయ్యగారు వేణుగోపాలస్వామి యాలయము నిర్మించుట ♦—

తే॥ ఆయన కుమాళ్ళలో జ్యేష్ఠుఁ ♦ డైన నరస
యాహ్వయుఁడు గ్రామపాలన ♦ మంది దాని
నేర్పుతో నోర్పుతోడను ♦ నిర్వహించి
సర్వజనరంజకుండన ♦ నుర్వినొప్పె.

వ॥ అట్లుండ గొంతకాలంబున కాపురంబున.

సీ॥ గోపాలబాలుఁడై ♦ గోవర్ధనుండయి
గోపికాచిత్త చ ♦ కోరుఁడగుచు
నవనీతచోరుఁడై ♦ నరకాది దానవ
భంజనుండయి వీర ♦ భద్రుఁడగుచు
విశ్వమోహనుఁడయి ♦ విబుధసంసేవ్యుఁడై
వేణుగానమున బ్ర ♦ వీణుఁడగుచు.

ద్రౌపదీమానసం ♦ రక్షకుండై యార్త
జనపాలనోద్యోగ ♦ చతురుఁడగుచు.

తే॥ దేవకీపుత్రుఁడై దేవ ♦ దేవుఁడగుచు
భక్తపాలుఁడై రుక్మిణీ ♦ భర్తయగుచు
నలరు గోపాలదేవుని ♦ యాలయంబు
శిథిలమై నాను మాత్రావ ♦ శిష్టమైన. 210

సీ॥ నరకాసురాది పు ♦ ణ్యజన శాత్రవబృంద
మారణోద్యోగ సం ♦ ప్రాప్తమనఁగ
వివిధగృహాంతర ♦ నవనీత చోరతా
చింతితార్థంబగు ♦ చేటనంగ
గులకాంతలై యొప్పు ♦ గోపికాజనవస్త్ర
మానహరణకర్మ ♦ మహిమమనఁగ
జన్మాంతర విశేష ♦ సంచిత ప్రారబ్ధ
పరమర్షి సంహార ♦ దురితమనఁగ

తే॥ భామినీ హత్యఁ జేసిన ♦ ఫలితమనఁగ
వేణుగోపాల నామక ♦ విగ్రహునకు
నిఖిల లోకాశ్రయునకు వి ♦ నీతునకును
నిలువనీడయు గన్పడ ♦ నేరదయ్యె.

తే॥ కలిమి గల్గిన నాప్తులై ♦ యలరువారు
కష్టకాలంబునం దెట్టి ♦ ఘనులకైన
కానివారౌట నెఱిఁగిన ♦ మానధనుఁడ
తండు భూస్థాపితుండైన ♦ దాని నెఱిఁగి.

తే॥ నరసయాఖ్యుండు సద్భక్తి ♦ వరుఁడు బరమ
నిష్ఠనా దేవుఁ దిరిగి ప్ర ♦ తిష్ఠఁ జేసి
యాలయంబును మంటప ♦ మచట గట్టి
నిత్యనైవేద్యముల నిడు ♦ నియమముంచె.

వ॥ మఱియు.

తే॥ గగనచుంబితమైన ప్రా ♦ కారమొకటి
నతఁడు నిర్మాణమొనరించి ♦ యతులభక్తి
సోదరాగ్రేసరుండగు ♦ సుబ్బరాయఁ
గూడి మాన్యంబులొసఁగెనా ♦ కోవెలకును. 215

తే॥ పరులు తనవారలనెడి భా ♦ వంబు లేక
పేదవారల యభివృద్ధి ♦ పెన్నిధితన
కంచు నెంచుచు వారిని ♦ గాంచిమఱియు
నరసయాఖ్యుండు నిజముగా ♦ సరసవరుఁడు.

తే॥ నీతివర్తనుఁడౌ వీని ♦ ఖ్యాతిఁగాంచి
పుడమిపాలకుల్ తాలూక ♦ బోర్డులోన
మెంబరుగ నియమించిరి ♦ మేటియనుచు
శక్తికొలఁదిగ బనిజేసె ♦ సభలనపుడు.

తే॥ దండిగానందఱును జేయు ♦ చుండినట్టి
ధర్మకర్తృత్వమంత యు ♦ దారబుద్ధి
నరసయాఖ్యునకిచ్చిరి ♦ సరసమతులు
పరమభక్తులునౌ కుటుం ♦ బమ్ము వారు.

—: బాలాత్రిపురసుందర్యాలయ నిర్మాణవృత్తాంతము :—

వ॥ ఆతండు నక్కార్యంబు మిక్కిలి సమర్థతతో నిర్వహించుచున్నంత శ్రీసంగమేశ్వరాలయంబున దక్షిణామూర్తి యంత్రంబగుటం జేసియు, నర్ధనారీశ్వరుండగు శివున కర్ధాంగి లేకుండుటచే గ్రామంబున సిరి నిల్చుటలేదని యొక్క దివ్యపురుషుండు దెల్పిన నద్దాని నాలకించి, నరసయ్య, శివలింగయ్య, భావయ్య, రామస్వామి, వెంకటప్పయ్య, బుచ్చయ్య, వీరభద్రయ్యలను సంగన్నగారి వంశస్థులు చేరి వారి రాజబంధువులగు ముమ్మలనేని కోదండ రామయ్య తోడను, నింకను పరుచూరి, క్రొత్తపల్లివారిలో గొందఱు ముఖ్యులతోడ నాలోచించి యందఱును ద్రవ్యంబు సమకూర్చి యంత.

సీ॥ ఏశక్తిలేకున్న ♦ నీ చరాచర జీవ
లోకమెల్లను సృష్టి ♦ లోన లేదు
ఏదేవి లేనిది ♦ యీశ్వరునకుం గూడ
చిత్తనిగ్రహమున్న ♦ జెల్లఁబోదు
ఏభగవతిపూజ ♦ నింపారఁ జేయని
ప్రజలకు నిర్వాణ ♦ పదవిలేదు
ఏయంబికా కృప ♦ యిసుమంత లేకున్న
వనితల కైదవ ♦ తనము లేదు

తే॥ అట్టిజగదీశ్వరికి మ్రొక్కు ♦ లాచరించి
పూజలం జేసి కొల్వంగ ♦ భుక్తిముక్తి

...మొనసిన దేవాల ♦ యంబొకండు
...వలి క్షేత్రమునఁ గట్టఁ ♦ గోరిరపుడు.

వ॥ ...దేవి బాలాత్రిపురసుందరీదేవి యని ...ముగాఁ బిలిచుకొని ...యమితోత్సాహవంతులై ...గాగ్యంబు లుప్పతిల్ల. ॥

సీ॥ త్రిపురసుందరి యాలయ ♦ మపుడుగట్ట
నెంచి వీరందఱును తమ ♦ యిచ్ఛకొలఁది
దేవళము గట్టి దేవిప్ర ♦ తిష్ఠఁ జేసి
గమిత నైభవమున జను లాదరింప.

తే॥ సంగమేశ్వరు సన్నిధి ♦ జలముకొఱకు
కూపమొక్కటి నిర్మింపఁ ♦ గోరి నేలఁ
ద్రవ్వి శిలలచే గట్టిరి ♦ దానియందు
సలిలమెల్లరు దిరునాళ్ల ♦ జనులు ద్రావ.

వ॥ గీనిని స్థాపనజెప్పిన కొత్తవంశీయులు మాత్రమే రగగా.

తే॥ నరసయామాత్యునకు సుతుల్ ♦ సరసమతులు
జననమందిరి సంగయ, ♦ జగ్గయాఖ్యు
లనఁగ గోపాలకృష్ణ ♦ యామాత్యుఁడనఁగ
విమలవిజ్ఞానవంతులై ♦ వెలయువారు.

లబ్బ్వమనకని దేవాల ♦ యంబొకండు
కూడలిక్షేత్రమునగట్టఁ ♦ గోరిరపుడు. 220

వ॥ అంతనా దేవికి బాలాత్రిపురసుందరీదేవి యని నామక
ణంబుఁగావించుకొని యమితోత్సాహవంతులై భ
క్తివైరాగ్యంబు లుప్పతిల్ల.

తే॥ త్రిపురసుందరి యాలయ ♦ మపుడుగట్టి
నెంచివీరందఱును తమ ♦ యిచ్ఛఁగొలఁది
దేవళముగట్టి దేవిప్ర ♦ తిష్ఠఁజేసి
రమితవైభవమున జను లాదరింప.

తే॥ సంగమేశ్వరు సన్నిధి ♦ జలముకొఱకు
కూపమొక్కటి నిర్మింపఁ ♦ గోరినేలఁ
ద్రవ్వి శిలలచేగట్టిరి ♦ దానియందు
సలిలమెల్లరు దిరునాళ్ల ♦ జనులుద్రావ.

వ॥ దీనిని పైనజెప్పిన కొత్తవంశీయులు మాత్రమే నిరి
రంత.

తే॥ నరసయాహ్వయునకు సుతుల్ ♦ సరసమతులు
జననమందిరి సంగయ, ♦ జగ్గయాఖ్యు
లనఁగ గోపాలకృష్ణ ♦ యాహ్వయుఁడనంగ
విమలవిజ్ఞానవంతులై ♦ వెలయువారు.

వ॥ ఇందు జగ్గయ్య యను నామాంతరము గల జగన్నా
ముసు వెంకన్నగారి వంశంబున వెంకటకృష్ణ నామునకు
దత్తపుత్రుగ నొసంగిరి. ఆయన వంశమటనభివృద్ధినొందె

క॥ ఆ వెంకటకృష్ణాఖ్యుని
భావముగని పెట్టి నడచి ♦ వాని పొగడ్తల్
స్థావరముగాఁగ బొందెను
వేవిధముల జగ్గయాఖ్య ♦ విదితయశుఁడిలన్.

తే॥ ఆజగన్నాథ మార్జించె ♦ నన్నివిధుల
భూహిరణ్యంబులను కొల్ల ♦ పోటుగాఁగ
నట్టులే దానధర్మంబు ♦ లాశ్రితులకు
బంచి సత్కీర్తి నార్జించె ♦ వసుధయందు.

ఈతం డొక్కమారు తురిమెళ్ళ పాఠశాల కైదువందల రూప్యంబు లొసంగె. మఱియు నితండు పితృకర్మంబులం బరిపూర్తి సేయునప్పు డిచ్చినదానంబులకును, తనకుమాళ్ళ కుమార్తెల పాణిగ్రహణ సమయమ్ములం జేసిన ధర్మంబులకును లెక్కలేదు.

తే॥ ఈమహామహునకు జని ♦ యించి నార
లనఁగ పుత్రులు ముగ్వురు ♦ నగ్రజుండు
వెంకయాఖ్యుండు, రఘురామ, ♦ వేంకటకృష్ణ
లనెడి వారలు తమ్ములై ♦ యలరి రిలను.

ఇందు వెంకయ్యచౌదరిలండను మున్నగుపాశ్చాత్యదేశంబుల కేగి యింజనీరింగు నాబడు శిల్పశాస్త్రం బభ్యసించి చక్రవర్తి దర్శనముం గూడ జేసి మగిడివచ్చి గుంటూరుజిల్లా యందింజనీయరు పదవిలో నుండి కీర్తిశాలియై విశేష భూము లార్జించి యగ్రహారద్వయంబు గొనియె.

తే॥ ఆశ్రితులకును వేదవి ♦ ద్యార్థులకును
కోరిన దొసంగ నర్హైను ♦ భూరి యశము
వెంకయాఖ్యుని బోలు ♦ వివేకి యెందు
గానలేమన్న నాశ్చర్య ♦ కరముగాదు.

వ॥ ఇతని తమ్ముండగు రఘురామవర్యుండును (బి. ఏ.) పట్ట పరీక్షానిద్ధుండై కీర్తివహించె. వీరి వంశంబింక వెంకన్న గారి వంశంబయ్యె. ఇంక సంగయ్యగారును దండ్రి యనంత రమున క్రమము దప్పక పరిపాలనాభారమును, శ్రీసంగ మేశ్వర, వేణుగోపాల స్వాముల యాలయముల ధర్మ కర్తృత్వభారమును తమ్ముఁడగు గోపాలకృష్ణయాఖ్యునితో గలిసి వహించుచు సర్వప్రజానురంజకంబుగ బాలనాకార్య ములు నిర్వహించుచున్నంత.

సీ॥ సంగయాఖ్యుని పుత్రులు ♦ సద్గుణనిధు
లెరి జగ్గయ బుచ్చికో ♦ టాహ్వయుండు
వేంకటేశ్వరరావను ♦ విమలయశులు
సంగమేశ్వరు బూజల ♦ సలుపువారు.

వ॥ ఇందు జగ్గయ్య, వెంకటప్పయ్య నామునకు దత్తుండై పైనఁ బేర్కొనం బడియె.

క॥ వినతుఁడగు బుచ్చికోటా
ఖ్యునకుఁ నరసింహ నామ ♦ కొమరుఁడు జ్యేష్ఠుం
డనఘుఁడు రాధాకృష్ణుం
డనువారలు జన్మమంది ♦ రతిసుకుమారుల్.

వ॥ గోపాలకృష్ణయ్యగారును గానశాస్త్రకళా కోవిదుండై, చిరకాలము తన గ్రామమున బురాణము సర్వజనానురంజకముగ జెప్పుచుండె. ఈతండును రెండు వివాహంబులం జేసుకొనియు పుత్రసంతానంబు నొందడయ్యె. గాని,

తే॥ పార్వతమ్మ యనెడు ♦ పత్నికి రామల
క్ష్మమ్మ నాగుమారి ♦ గలిగె మఱియు
నన్న పూర్ణసతికి ♦ ననురాగవతికి య
శోదయనెడు ముద్దు ♦ సుత జనించె.

వ॥ ఇట్లుండ శ్రీసంగమేశ్వరస్వామి ధర్మకర్తలుగానున్న సంగయ గోపాలకృష్ణ నామాంకితులు దేవునకు శాశ్వత భవనవస్తు నిర్మాణంబులు సేయంగోరి ప్రసిద్ధిజెందిన శిల్ప శ్రేష్ఠుల నాహ్వానము నొనరించి వారికిఁ గర్తవ్యము బోధింపుడు, వారందఱుఁ దమతమ ప్రావీణ్యంబులు గన్పఱచుట కనువొదవెనని ముదంబొందుచు.

తే॥ గోపురంబులు ప్రాకార ♦ కుడ్యములును
వస్తువులు వాహనంబుల ♦ వ్వారిగాగ
సౌధములు వంటశాలలు ♦ సర్వదేవ
కార్యముల కనుకూలింపఁ ♦ గట్టిరంత.

వ॥ ఇట్లాధర్మకర్తల్కాత్వపదవిచే దేవద్రవ్యంబు వెచ్చించి వారలు కావించిన నిర్మాణంబు లన్నియు బహుజనస్తవనీయంబు లయ్యె.

క॥ సదయుఁడు రామస్వామికి
సుదతీమణి రుక్మిణమ్మ ♦ సుతయగ్రజగా

నుదయించె నాగరత్నము
పిదపఁ జనియించె వీరు ♦ విదితయశస్కుల్.

వ॥ వీరలను క్రొత్తపల్లి దశరథరామయ్య, జంపాల వెంకయ్య గార్లకు వరుసగా నిచ్చి తన యాస్తినంతయు వారల కొసంగి, రామస్వామి గతించి జీవన్మృతుండయ్యె.

–♦ సంగన్నగారి కడసారి పుత్రుఁడు లింగయ్యగారి వంశము ♦–

క॥ లింగాహ్వయు కొమరుండగు
సంగాఖ్యుఁడు శమదమాది ♦ సద్గుణయుతుఁడై
యంగజ గర్వవిభంగుని
సంగేశుని బూజలెపుడు ♦ సల్పుచునుండెన్.

వ॥ ఇతండును పరుచూరి, రఘువయ్యగారికుమార్తె పకీరమ్మను యార్లగడ్డ వెంకయ్యగారికుమార్తెర త్తమ్మను పరిణయంబై నంత. 245

తే॥ సంగయాహ్వయునకు సుతుల్ ♦ జననమైరి
సుగుణనిధులగు వెంకట ♦ సుబ్బయాఖ్య
వెంకటప్పయ, శివలింగ ♦ వీరవరులు
సాహసౌదార్యుఁడు కుమార ♦ స్వామిమఱియు
రామకృష్ణాహ్వయుండును ♦ రమ్యగుణుఁడు.

క॥ వెంకట సుబ్బాఖ్యున కక
లంకచరిత్రుఁడగు సుతుఁడు ♦ రంజిల్లెనిలన్
శంకర జనార్దనుల పద
పంకేరుహములను గొల్చు ♦ భక్తుఁడనంగన్

వ॥ ఇతండు సంగయ్యనా బేరొంది ప్రసిద్ధివహించె. వెంకటప్పయ్య యవివాహితుండై నెటాలుదేశంబునకు ద్రవ్యసంపాదనార్థమేగి యచట మరణించె. కుమారస్వామియు నకాలమరణంబునొందె. తక్కంగల వారికెంకను పుత్రసంతానంబు గల్గదయ్యె. శ్రీసంగమేశ్వరభక్తులై వర్ధిల్లు నీకొత్తవారి వంశమువారు సంగమచామర్లపుర వాస్తవ్యులై యొప్పిరి.

—: తుది పల్కులు :—

క॥ విరచించితి నక్షయ వ
త్సరమున, నాశ్వీజశుద్ధ ♦ దశమి దినమునన్
బరిపూర్తిజేసినాఁడను
పరమోల్లాసమున నాదు ♦ వంశచరితమున్

క॥ తెలిసిన వరకుం దెలిపితి
కలరూపునె, యతిశయోక్తి ♦ కవులకులక్ష్యం
బిలఁగాన నెల్లవారిది
దలఁచిచదివి సంతసింప ♦ ధన్యుఁడనగుదున్.

క॥ న్యూనాధికముల నెచ్చటఁ
బూనిక వచియింపలేదు ♦ పొరబాటన్నన్
మానవ సహజ గుణంబే
గానన్ సవరించుకొండు ♦ గ్రంథమునీదే.

క॥ సారా సార విచారా
శ్రీరామపదారవింద ♦ సేవకచతురా
మేరుగభీరా! సత్యవి
చారా! భూసురవరార్థి ♦ జనమందారా!

మంగళము.

ఉత్సాహ॥ సారసాక్ష పరమపురుష ♦ సన్నుతా మహాత్మ, వి
స్ఫారకీర్తివంత సుగుణ ♦ సాంద్రనిర్మలాత్మకా
ధీరమానసాబ్జభృంగ ♦ దివ్యతేజశోభితా
మారహాసనశీలదేహ ♦ మంగళంబు నీకగున్

గద్య.

ఇది శ్రీపరమేశ్వర కరుణాకటాక్ష వీక్షణ ప్రసాదిత కావ్య
రచనా కౌశల, కొత్తవంశ జలధిసుధ ర శివలింగ
యాఖ్య రాజమాంబాగర్భజనిత, పనుకునూళ్ల
గోత్రోద్భవ భావయాఖ్య విరచిత సంగ
భూపాలీయాంతర్గత తృతీయా
శ్వాసము, సర్వంబును
సంపూర్ణము.